# గుర్రం తెలివి తేటలలు

# జీవన్ మరియు వానుల ఆశ్చర్యం



గుర్రం తెలివి తేటలకు జీవన్ మరియు హానుల ఆశ్చర్యం! "క్లవర్ హాన్స్" అనే గుర్రం 20 వ శతాబ్దపు మొదటి భాగంలో జర్మనిలో వుండేది. అతనికి చదవడం, లెక్కలు చేయడం యింకా ప్రపంచ రాజకీయాలకు సంబంధించిన ప్రశ్నలకు సమాధానాలు చెప్పడం వచ్చు.

లెక్కల గురించి ప్రశ్నించినప్పుడు (3+4 లాంటివి) హన్స్ సమాధానంగా పాదం కొట్టేది (7 సార్లు). ఇతర ప్రశ్నలకు (అనగా, లండన్, బ్రిటన్‌కు రాజధానా?) తలవూపడం లేదా ఆడించడం ద్వారా సమాధానం చెప్పేది. బ్లాక్ బోర్డు మీద వ్రాసిన ప్రశ్నలకు కూడ సమాధానం




చెప్పేది.

ఆఖరికి హన్స్ యొక్క రహస్యం బయట పడింది. అతని చుట్టూ వున్న వారి హావ భావాలను కని పెడ్తూ వుండేది. ప్రత్యేకంగా



అతని మాష్టరు ఓస్టెన్‌వి.

లెక్కలకు సంబంధించిన ప్రశ్న అడిగినప్పుడు జనం 'హన్స్' పాదాలకేసి చూచే వారు దానితో పాదం కొట్టడం మొదలు పెట్టేది. సరైన నంబరు వచ్చే సరికి, వారికి తెలియకుండానే, ఏదో విధంగా భావం వ్యక్త పర్చేవారు. తలవూపడం లేదా కొద్దిగా నవ్వడం లాంటివి. హన్స్ కొట్టడం మానేస్తుంది. లెక్కలకు సంబంధించిన ప్రశ్నలకు కూడ యిలాంటివే నేర్చుకుంది. ఈ కిటుకు ఎలా నేర్చుకుందో ఎవ్వరికి తెలియదు.

ఆశ్చర్యకరమైన విషయ మేమిటంటే, గుర్రం విధానాలు తెల్పినప్పటికి, వారి ప్రశ్నలు పంపడం మానలేదు.





జీవిత భీమా అనేది మీ కుటుంబాన్ని సురక్షితంగా ఉంచుకోడానికి అతి శ్రద్ధమైన మార్గం. దాన్ని గురించి తెల్సుకోండి.



**లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా**

daChunha/LIC/127/82 TL

# ప్రతిక్షణం ఫ్లాష్ తాజాదనంతో పొంగిపోతోంది.

ఎందుకంటే కేవలం ఫ్లాష్‌లోనే
ఇప్పుడు నీలాకాశం రంగు
నోటి శుద్ధకారిణి ఉంది కనుక




## ఫ్లాష్ టూత్ పేస్ట్

**ఫ్లాష్ వాడండి, చిరునవ్వులు చిందించండి.**

ఫ్లాష్‌లోని నీలి రంగు నోటి శుద్ధకారిణి, మీరు పళ్లు బ్రష్ చేసుకోవడం ప్రారంభించిన తక్షణం మీ నోటి గాలిని తాజాగా మారుస్తుంది, మీ నోరంతటినీ శుభ్రంగా, తాజాగా మిలమిలలాడేలా చేస్తుంది. సంపూర్ణమైన నోటి సంరక్షణలో, దాని ఉత్తమ నాణ్యతకు గాను వియన్నాలో ప్రపంచ సెలక్షన్ బహుమతిని ఫ్లాష్ గెలుచుకుందంటే మరి ఆశ్చర్యమేముంది? ఫ్లాష్ ఇచ్చే సంరక్షణ మీ ఆరోగ్యమైన చిరునవ్వును రోజురోజుకీ మెరిపిస్తుంది.

everest/82/FL/81-tl

Cadbury's GEMS

MILK CHOCOLATE

నావెంటే నానేస్తం నే పిలిస్తే పలుకు
ఆ చక్కనైన ఎలుగు పేరే పలుగు
మనసేస్తే దానికి తినడానికి పెడతా
ఇస్తుందపుడేది జెమ్స్ నాకింక ఎంచక్కా

**చేజిక్కించుకోండి ఆ మధురక్షణాల్ని**
**చేజిక్కించుకోండి ఆ జెమ్స్‌ని!**



క్యాడ్‌బరీస్
చాక్లెట్లు

**పువ్వులన్నీ సుగంధాన్ని పంచుతాయి,క్యాడ్‌బరీస్ జెమ్స్ తియ్యదనాన్ని అందిస్తాయి.**

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళ కథ [''మహాకవి'']కి ఆధారం జొన్నలగడ్డ రత్న రచన. కవులకూ, పండితులకూ, యితర కళాకారులకూ సంఘంలో గౌరవనీయమైన ఒక ప్రత్యేకస్థానం వుంటుంది. అలాంటి వాళ్ళు, స్వార్థం కొద్దీ దుష్టకార్యాలకు పూనుకుంటే, పామరుల వలెనే ఎలా శిక్షకు గురిఅవుతారో, ''రాజద్రోహి'' అన్న కథలో తెలుసుకుంటాం:

## అమరవాణి

న ధైర్యేణ వినా లక్ష్మీః, న శౌర్యేణ వినా జయః,
న జ్ఞానేన వినా మోక్షః, న దానేన వినా యశః.

[ధైర్యం లేనివాడు సంపదనూ, శౌర్యం లేనివాడు విజయాన్నీ, జ్ఞానం లేనివాడు మోక్షాన్నీ, దానగుణం లేనివాడు కీర్తినీ పొందలేడు.]

సంపుటి 71 సెప్టెంబర్ '82 సంచిక 3

విడి ప్రతి : 1–75 : : సంవత్సర చందా : 21-00





# దయ్యాలకు దడవనివాడు

నాగన్నకు చిన్నతనంలోనే తల్లీ, తండ్రీ పోయారు. వాడు ఇరవై ఏళ్ళ వయసు వాడయేవరకూ, గ్రామంలోని మోతుబరి రైతుల ఇళ్ళల్లో పాలేరుగా పనిచేస్తూ పొట్ట నింపుకున్నాడు. వాడు సహజంగా మంచి తెలివైనవాడు కావడంతో, వ్యవసాయపు పనుల్లో నేర్పరి అని పేరు సంపాయించాడు.

నాగన్న యిక తను పెళ్ళాడి, ఒక ఇంటివాడు కావాలనుకున్నాడు. కాని, వాడికి పిల్లనిచ్చేందుకు ఎవరూ యిష్టపడలేదు.

"నువ్వు చూడబోతే పాలేరువి. నీ యజమాని ఇంటి పనిపాటుల్లో రాత్రింబవళ్ళు ఒళ్ళు హూనం చేసుకుంటావు. నీకు పిల్లనిస్తే, మా పిల్ల ఆలనాపాలనా అయినా చూసేందుకు నీకు తీరుబాటుంటుందా? నువ్వు పాలేరు పని మానేసి, ఎవరి పొలమైనా కౌలుకు తీసుకునేటట్టయితే, మా పిల్లనిస్తాం," అన్నారు ఒకరిద్దరు.

వాడు తనకు తెలిసిన పెద్ద రైతుల నుంచి పొలం కౌలుకు తీసుకునే ప్రయత్నం చేశాడుగాని, అది సాధ్యపడలేదు. దానితో వాడికి తను పుట్టి పెరిగిన గ్రామం మీదా, తన బతుకుతీరు మీదా ఏవగింపు కలిగింది.

నాగన్న ఒకనాటి ఉదయం గ్రామం వదిలి, మూడు రోజులపాటు అడవి దారిన ప్రయాణంచేసి, నాలుగోనాటి ఉదయానికి మరొక గ్రామం చేరాడు.

ఆ గ్రామానికి నాలుగు పక్కలా పచ్చటి పంట పొలాలున్నవి. అయితే, నాగన్న గ్రామంలోకి పోతున్న దారిపక్కన, పంటపొలాల మధ్యలో, ఒక పెద్ద బీడూ, పాడుబడిన బావీ వాడి కంటబడినై.

గుంటక సాంబిరెడ్డి

నాగన్న ఆశగా ఆ బీడు పొలం కేసి చూస్తూ, ఇది నాకు కౌలుకిస్తే, బంగారం పండించగలనే అనుకుని, దారేపోతున్న ఒక మనిషిని ఆపి, ఆ బీడెవరిదని అడిగాడు. అతను గ్రామంలో ఎత్తుగా వున్న ఒక మేడ కేసి చేయి చూపి, "అందులో వుండే జమీందారుగారిది," అని తన దారిన పోయాడు.

నాగన్న జమీందారు దగ్గరకు పోయి, తన గురించి చెప్పుకుని, "అయ్యా, మీరు సాగు చెయ్యకుండా వదిలిపెట్టిన బీడును, నాకు కౌలు కిచ్చారంటే, మీ పేరు చెప్పుకుని సుఖంగా బతికిపోతాను," అన్నాడు.



జమీందారు నవ్వి, "అది దయ్యాల బీడు! దాని సంగతి, యీ చుట్టుపక్కల అన్ని గ్రామాలవాళ్ళకూ తెలుసు. అందులో భయంకరమైన దయ్యాలు చేరాయి. బీడును సాగులోకి తేగలవాళ్లకు సగం బీడు ఉచితంగా యిస్తానని చాటింపు కూడా వేయించాను. ధైర్యవంతులమనుకుని రాత్రివేళ అక్కడికి వెళ్ళినవాళ్ళు, ప్రాణాలతో తిరిగిరాలేదు. కనక, ఆ బీడు జోలికి పోకు!" అన్నాడు.

నాగన్నకు దయ్యాలంటే భయంలేదు. బీట్లో నుంచి దయ్యాలను తరిమేయ గలిగితే, సగం బీడు తనదవుతుందన్న ఆశతో, వాడికి ఎక్కడలేని తెగింపూ వచ్చింది. వాడు జమీందారింట్లోనే భోజనం చేసి, చీకటి పడగానే తన చేతి కర్ర తీసుకుని, బీట్లోకి పోయి, ఒక పెద్ద చెట్టుబోదెను ఆనుకుని కూర్చున్నాడు.

ఒక జాము రాత్రి గడిచేసరికి, నాగన్న ముందు భయంకరమైన రెండు దయ్యాలు ప్రత్యక్షమయ్యాయి. వాడు చేతి కర్రను గట్టిగా గుప్పెట బిగించి పట్టుకుని, ఏ మాత్రం తొణక్కుండా వాటి ముఖాల్లోకి పరీక్షగా చూశాడు.

దయ్యాలు రెండూ ఒకడుగు వెనక్కు వేసి, "ఆహాఁ, ఏం నీ ధైర్యం! లోగడ



యిక్కడికి వచ్చినవాళ్ళు, మమ్మల్ని చూస్తూనే గుడ్లు తేలవేశారు. ఇంతకీ, ఎవరు నువ్వు ?'' అని అడిగినై.

''నే నెవరైతే ఏంగాని, పెను భూతాలూ, బ్రహ్మరాక్షసులూ తిరిగే, ఈ భయంకర వేళలో మీరు ఏదో పని గట్టుకుని యిక్కడికి వచ్చినట్టుంది. మీకేం కావాలి ?'' అన్నాడు నాగన్న.

''వీడు మన తగువు తీర్చగల సమర్థుడులా వున్నాడు!'' అన్నదొక దయ్యం.

అవునన్నట్టు రెండో దయ్యం తలాడించింది.

''ఈ పాడుబడ్డ బీడుకు, మా ఇద్దర్లో ఎవళ్ళో ఒకళ్ళం, అన్ని హక్కుభుక్తాల్తో యజమానులం కాదలుచుకున్నాం. ఈనాటివరకూ మేం చేసిన ఘనకార్యాల సంగతి విని, మాలో ఎవరు గొప్పో నువ్వు న్యాయంగా తీర్పివ్వాలి. అలా చెయ్యక పోయావో, నువ్వు తెల్లవారాక వెళ్ళేది గ్రామంలోకి కాదు, ఆ పాడుబడ్డ దిగుడు బావిలోకి,'' అన్నవి దయ్యాలు.

''అలాగే న్యాయంగా తీర్పిస్తాను. నాక్కావలసింది మీ శక్తి సామర్థ్యాలను గురించిన ప్రత్యక్షసాక్ష్యం; గతంలో చేసిన ఘనకార్యాల గొడవలు కాదు,'' అన్నాడు నాగన్న.

''సరే, యిప్పుడు మమ్మల్ని ఏం చేయమంటావో చెప్పు!'' అన్నవి దయ్యాలు.

నాగన్న తన చేతికర్రతో ఒక దయ్యం భుజం మీద చిన్నగా కొట్టి, ''నువ్వు, ఈ బీడు మధ్య ఒక చక్కటి అందమైన ఇల్లు కట్టాలి. ఆ పని, అర్ధరాత్రిలోగా పూర్తి కావాలి,'' అన్నాడు.

''ఓ, అదెంత పని!'' అంటూ దయ్యం వెళ్ళిపోయింది.

నాగన్న యీసారి రెండో దయ్యం నడుం మీద తన చేతికర్రతో చిన్నగా పొడిచి, ''నీతోటి దయ్యం ఇల్లు కట్టడం పూర్తి చెయ్యగానే, నువ్వు దాని చుట్టూ ప్రహరీ ఏర్పాటు చేసి, లోపల కూర

పాదులూ, పూలచెట్లూ నాటాలి. ఈ పని, తొలికోడి కూసే లోపల పూర్తి కావాలి,'' అన్నాడు.

''ఇదొక లెక్కా ఏం, నాకు!'' అంటూ రెండో దయ్యం వెళ్ళిపోయింది.

సరిగా అర్ధరాత్రి సమయంలో మొదటి దయ్యం నాగన్న దగ్గిరకు వచ్చి, ''ఇంటి పని పూర్తయిపోయింది. నేను గొప్ప దాన్నని తీర్పు యిస్తావుగదా?'' అన్నది.

నాగన్న ఒక క్షణం ఆగి, ''అలాగే యివ్వాలిమరి! కాని, అలా చేస్తే, ఆ రెండో దయ్యం నన్ను బతకనిస్తుందా?'' అన్నాడు.

''ఆ భయాలేం పెట్టుకోకు. నా వెంటరా, దాన్ని హతం చేసే మార్గం చెబుతాను,'' అంటూ దయ్యం నాగన్నను బీడు చివరికి తీసుకుపోయి, ఒక మొక్క చూపించి, ''దీని వేరు చేతికి కట్టుకో. దీని కాండాన్ని ధూపంగా వేశావంటే, అది చావడమో లేక కొన్ని ఆమడల దూరం పారిపోవడమో చేస్తుంది,'' అన్నది.

''సరే, రేపు రాత్రికి రా. తీర్పు నీ పక్షానే వుంటుంది. ఆ రెండో దాన్ని రేపు రాత్రికి రమ్మంటాను,'' అన్నాడు నాగన్న.

తొలికోడి కూసేవేళ రెండో దయ్యం పని పూర్తి చేశానంటూ ఉత్సాహంగా నాగన్న దగ్గిరకు వచ్చింది.

నాగన్న దాన్ని మెచ్చుకుని, తీర్పు దాని పక్షానే వుంటుందని చెప్పి, మొదటి



దయ్యం తనకేమన్నా హాని చేస్తుందేమో అన్నాడు. దయ్యం అతణ్ణి భయపడవద్దని, బీడులో మరొక చివరకు తీసుకుపోయి, అక్కడ నేలమీద పాకుతున్న ఒక తీగ మొక్కను చూపి, "దీని వేరును చేతికి కట్టుకో. ఆ దయ్యం నీ దగ్గిరకు రాగానే, దీని ఆకుల్ని నిప్పులో వెయ్యి. ఆ పొగకు అది చావడమో, కారడవులు పట్టి పోవడమో చేస్తుంది," అన్నది.

నాగన్న మొక్కవేరూ, ఆకులూ తీసుకుని, దుస్తుల్లో దాచి, మొదటి దయ్యానికి చెప్పినట్టే, దాన్నీ మర్నాటి రాత్రికి రమ్మన్నాడు.

తరవాత జమీందారు దగ్గిరకుపోయి, జరిగినదంతా చెప్పాడు. నాగన్న దయ్యాల బీడులోంచి అసలు ప్రాణాలతో తిరిగి రావడమే జమీందారుకు, ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ కలిగించింది.

నాగన్న దయ్యాలు చెప్పిన వేళ్ళను ముంజేతికి కట్టుకుని, చీకటి పడగానే ఒక కుంపటి తీసుకుని దయ్యాలబీడులోకి వెళ్ళి, చలి కాగుతూ కూర్చున్నాడు. జాము రాత్రి గడిచేసరికి దయ్యాలు రెండూ, ఏమిటి నీ తీర్పు అంటూ నాగన్న దగ్గిరకు వచ్చినై.

వాడు దయ్యాలను మరి కాస్త దగ్గిరకు రమ్మని, "పగలల్లా, న్యాయశాస్త్రగ్రంథాలు చదువుతూ కూర్చున్నాను. ఈ బీడు యిక్కడ వున్న మన ముగ్గురిలో శక్తిమంతులైన వాళ్ళదని తెలుసుకున్నాను. నేనే శక్తిమంతుణ్ణి!" అంటూ దయ్యాలు చెప్పిన చెట్టు కాండాల్నీ, ఆకులనూ కుంపటి నిప్పుల్లో వేశాడు.

ఆ వెంటనే గుప్పుమంటూ పెద్ద పొగ లేచింది. దయ్యాలు రెండూ కీచుమంటూ అదృశ్యమయినై.

జమీందారు నాగన్న ధైర్యాన్ని మెచ్చుకుని, వాడికి బీడులో సగం దానం యిచ్చాడు. నాగన్న దయ్యాలు కట్టిన ఇంట్లో వుంటూ, వ్యవసాయం ప్రారంభించి, కొన్నాళ్ళ తర్వాత తగిన పిల్లను పెళ్ళాడి సుఖంగా వున్నాడు.






## 11

[తాము నివసించే అడవిప్రాంతాలను, నరవాహనుడు తన అనుచరులకు ధారాదత్తం చేశాడని తెలియగానే, కోయ పెద్దలందరూ భగ్గున మండిపడ్డారు. వాళ్ళందరూ తోడేలు గూడెంలో సమావేశమై, నరవాహనుణ్ణి ఎదిరించాలనే నిశ్చయానికి వచ్చారు. కోయ వృద్ధుడు ముందుగా ఒక దూతను శాంతి రాయబారిగా నరవాహనుడి దగ్గిరకు పంపాడు. తరవాత—]

తోడేలు గూడెంలో కోయపెద్దల సమావేశానంతరం జరిగిన గాథంతా శివదత్తుడు చెప్పుకుపోతున్నాడు. మందరదేవుడు అంతా శ్రద్ధగా ఆలకిస్తున్నాడు.

"నేను భయపడినంతా అయింది!" అన్నాడు శివదత్తుడు. "దూత, గాడిద మీద ఎక్కి రావటం చూసిన ఇద్దరు యువకులు మైదానం కేసి పరిగెత్తి కొద్ది సేపట్లో దూతను గూడెం చేర్చారు. అతడి వాలకం చూస్తూనే పాపం, అతడు పడిన బాధలు ఎలాంటివో నేను ఊహించాను.

దూత తాను పడిన నరకయాతన అంతా వివరంగా చెప్పాడు. సైనికులు అతణ్ణి నరవాహనుడి దగ్గరకు తీసుకుపోయారు. నరవాహనుడు కోయవృద్ధుడు రాసిన లేఖ చదువుకుని మండిపడి, దూతను యాభై కొరడా దెబ్బలు కొట్టించి, తల బోడి చేయించి, ముఖమంతా మసి




పరిస్థితులు నాకు అనుకూలంగా కాక పోయినా, నరవాహనుడికి వ్యతిరేకంగా పరిణమిస్తున్నట్టు నేను గ్రహించాను. సమర సేనుడి మరణానంతరం, యిక తనను కుండలినీ ద్వీపంలో ఎదిరించే వారెవరూ లేరన్న గర్వంతో వున్న నర వాహనుడికి యీ కోయల తిరుగుబాటు ఒక గుణపాఠాన్ని నేర్పగలదు!

"శివదత్తా, మీ నరవాహన రాజు ప్రదర్శించిన పొగరుబోతుదనం గమ నించారుగదా?" అంటూ నా కేసి సాభి ప్రాయంగా చూశాడు వృద్ధుడు.

"అయితే మీరు యుద్ధానికి సిద్ధమే నన్న మాట?" అని అడిగాను.

కోయవృద్ధుడు ఒక క్షణకాలం తల వంచుకుని, తరవాత సాలోచనగా నాకేసి చూస్తూ, "అంతకన్న మరే మార్గమూ నాకు కనబడటంలేదు. లోగడ మీరు చెప్పినట్టు సుశిక్షితులైన అతడి సైనికు లను, ముఖాముఖి ఎదిరించటం ప్రమాద కరం. కనుక పొంచివుండి హఠాత్తుగా మీద పడి శత్రువులను చీకాకు పరిచే యుద్ధతంత్రాన్ని అనుసరించటం క్షేమం గదా?" అన్నాడు.

"కాని, ఆ పద్ధతి విజయాన్ని సమ కూర్చలేదు. ఏదో ఒక నాడు, మీరు కుండలినీ నగరాన్నీ, రాజప్రాసాదాన్నీ

పూసి, గాడిద మీద రాజవీధులు వూరే గింపించాడు. తరవాత 'మీ కులపెద్దకు యిది నా జవాబు!' అంటూ అతడి వీపుకు ఒక మేక చర్మం కట్టించాడు. దాని మీద ఒక కోయవాణ్ణి, నరవాహన సైనికుడు గొలుసులతో బంధించి తీసుకు పోతున్నట్టు చిత్రింపించాడు.

ఆ చిత్రంలోని భావాన్ని అర్థంచేసు కున్న వృద్ధుడు నా కేసి తిరిగి, "అయితే, మాకు బానిసబ్రతుకో, మరణమో తప్ప దన్నమాట. ఈ రెంటిలో తప్పనిసరైతే నేను మరణాన్నే కోరుకుంటాను!" అన్నాడు. ఆ నిమిషాన అతడి నేత్రాల నుంచి నిప్పులు కురిసినై.

ముట్టడించి, వశపరచుకోవలసి వుంటుంది!'' అన్నాను.

అవునన్నట్టు వృద్ధుడు తల వూపాడు. అంతలో నలుగురైదుగురు కోయ యువకులు కేకలు వేస్తూ, మేము వున్న చోటుకు పరిగెత్తుకుంటూ వచ్చారు. వృద్ధుణ్ణి చూస్తూనే నమస్కరించి, ''అయ్యా, శత్రువులు పెద్ద బలగంతో మన మీదకు దాడి వస్తున్నట్టుంది. పదాతి అశ్విక దళాలేకాక, కొందరు ఏనుగుల మీద కూడా ఎక్కి వస్తున్నారు. వాళ్ళు వేల సంఖ్యలో వున్నారు. మనం ఏం చేయాలి?'' అని అడిగారు.




''మనం అంత పెద్ద సైన్యాన్ని ఎదిరించబోవటంలేదు.'' అన్నాడు వృద్ధుడు నిబ్బరంగా. ''ఆ వచ్చే శత్రువులను యీ అడవిలో తమకు తోచిన చోటికి వెళ్ళనివ్వండి. కాని, వీలు దొరికినప్పుడల్లా హఠాత్తుగా దాడి చేసి చీకాకు పరచండి!''

''మనం మచ్చిక చేసిన పులులనూ, సింహాలనూ వుపయోగించవచ్చా?'' అని ఒక కోయ యువకుడు ప్రశ్నించాడు.

ఓ, నిస్సందేహంగా!'' అన్నాడు వృద్ధుడు. ''విష బాణాలనూ, విష సర్పాలనూ....ఎలా అయినా సరే, శత్రువు హడలెత్తేట్టు చేయండి!''

ఈ ఆజ్ఞలు విని కోయ యువకులు వెళ్ళిపోయారు. శత్రువుల మీద మచ్చిక చేసిన పులులనూ, సింహాలనూ యెలా వుపయోగిస్తారో నా కర్థంకాలేదు. విషపు బాణాల సంగతి నాకు తెలుసు. అడవులలో నివసించే అనేక ఆదిమ జాతులు శత్రుసంహారానికి విషపూరితమైన బాణాలను ప్రయోగిస్తారు. అవి ఒకసారి శత్రువును తాకితే, వాటి మొనలకు పూసివున్న విషం కారణంగా ఆ శత్రువు నానా యాతనా పడి తప్పక మరణించవలసిందే.

''శివదత్తా, మిమ్మల్ని నేనొక రహస్య ప్రదేశానికి తీసుకుపోతాను,'' అన్నాడు కోయ వృద్ధుడు.

ఆ రహస్య ప్రదేశం యెక్కడో, యీ పట్టున అక్కడికి వెళ్ళవలసిన అవసరమేమిటో నాకర్థం కాలేదు. నా సంశయాన్ని గమనించిన వృద్ధుడు నవ్వుతూ, ''శివదత్తా, శత్రువుల నుంచి కాపాడుకునేందుకు మాకూ మీ వలెనే కోటలూ, కందకాలూ, యితరత్రా సాధనాలూ వుంటవి. నే చెపుతున్న రహస్య ప్రదేశం, మా కోయలలో కొద్దిమందికి తప్ప, అందరికీ తెలియదు. అది కొన్ని వందల సంవత్సరాల కిందట శిథిలమై పోయిన ఒక కొండ మీది దుర్గం. నరవాహనుడికి వ్యతిరేకంగా మేము జరపబోయే యుద్ధం, అక్కడినించే నడపబడుతుంది,'' అన్నాడు.

నేను నా అనుచరులతో బయలుదేరాను. కోయ వృద్ధుడి వెంట కొంతమంది యువకులు వున్నారు. అందరం కలిసి దట్టంగా వున్న అడవి ప్రాంతం కేసి బయలుదేరాం. మేము వెళ్ళే మార్గంలో అనేక కోయగూడేలు వున్నవి. ప్రతి గూడెంలోనూ యుద్ధ సన్నాహాలు జరుగుతున్న సూచనగా చాలా కోలాహలం కనబడింది. ఒక గూడెంలో కొందరు కోయ యువకులు నాలుగైదు చిరుతపులులకు మెడలకు తాళ్ళు కట్టి చిన్న చిన్న గుడిశెల నుంచి బయటికి లాక్కువస్తున్నారు. ఎంతో కాలంగా మచ్చిక చేయబడిన ఆ పులులు, పెంపుడు కుక్కల లాగా వాళ్ళ వెంట పడి వస్తున్నవి.



"శివదత్తా, వీటినే మా కోయ భటులు, నరవాహనుడి సైనికుల మీద ప్రయోగించ నున్నది. విచ్చలవిడిగా వదలబడిన ఒక్కొ పులి, వందమంది వీరుల పెట్టు అని మీరు త్వరలోనే గ్రహిస్తారు. ఇక, నరవాహనుడి ఏనుగుల మందలను చెల్లా చెదరు చేయటానికి అవసరమైన సింహాలూ, కాలిబంట్లను హతమార్చేం దుకు పనికివచ్చే అన్నిరకాల ఆయుధాలూ మా దగ్గర తయారుగా వున్నవి." అన్నాడు వృద్ధుడు.

ఆ సమయంలో, ఆ కోయల ధైర్య సాహసాలను నేను మెచ్చుకున్నాను. విజయంలో ఆ వృద్ధుడికి వున్న నమ్మకం నన్ను చాలా ఆశ్చర్యపరిచింది. సుశిక్షిత మైన సైన్యాన్ని, పెంపుడు మృగాల ద్వారా, అక్కడా యిక్కడా ప్రయోగించిన విషపు బాణాలవల్లా జయించటం సాధ్య మయ్యే పని కాదని ఆ వృద్ధుడికి తెలియదు!

అతడు దీర్ఘాలోచనతో తల వంచుకుని ముందు నడుస్తున్నాడు. చిన్న చిన్న గుట్టలూ, పుట్టలూ దాటుకుంటూ కీకా రణ్యంగా వున్న ప్రాంతాన్నించి మేము ముందుకు కదులుతున్నాం. ఒకచోట పదిమంది కోయలు చిన్న చిన్న బుట్టలలో వున్న వేటినో ఒక పెద్ద గంపకు చేర వేస్తున్నారు. ఆ చేరవేయటంలో వాళ్ళు కనబరుస్తున్న జాగ్రత నన్ను ఆశ్చర్య పరిచింది.



"ఆ పెద్ద గంపలో వాళ్ళు వేస్తున్న వేమిటి?" అని వృద్ధుణ్ణి అడిగాను.

"సర్పాలు!" అన్నాడు, వృద్ధుడు. "విష సర్పాలు! వీటి వుపయోగం యేమిటో మీరు త్వరలోనే చూస్తారు!" అంటూ నవ్వాడు.

ఆ సరికి మేమంతా ఒకానొక కొండ ప్రాంతానికి చేరాం. ఎదురుగా యెత్తయిన కొండ వున్న సూచనగా, చాలా యెత్తున చెట్లూ చేమలూ కనిపించాయి.

"మనకు ఎదురుగా వున్నది చాలా యెత్తయిన కొండ అనీ, దాని మీద ఒక శిథిలమైన దుర్గం వున్నదనీ యీ ద్వీపంలో చాలామందికి తెలియదు. చిన్నప్పటి నుంచీ ఈ ప్రాంతాన తిరిగిన మాబోటి వాళ్ళకు మాత్రం దాని ఉనికి తెలుసు!" అన్నాడు వృద్ధుడు.

నేను తల వూపి వూరుకున్నాను. ఒక వేళ యీ నట్టడవిలో బలమైన దుర్గం అంటూ ఒకటివుంటే, నరవాహనుణ్ణి అక్కడినించి ఎదిరించటం చాలా తేలిక అని నాకు తోచింది. ధైర్య సాహసోపేతులైన రెండు మూడు వేలమంది కోయ యువకుల సాయంతో, నరవాహనుణ్ణి అక్కణ్ణించి నానా తిప్పలూ పెట్టవచ్చు.

"కోట బాగా శిథిలమైపోయి వున్నదా?" అని వృద్ధుణ్ణి అడిగాను.




"బాగా శిథిలమైపోయిందని చెప్పలేం కాని, మొత్తం మీద శిథిలమైన దశలోనే వుంది. ఐనా, ఒకసారి మనం దాన్ని ఆక్రమించుకుకూచుంటే, అక్కడికి శత్రువులు పాదచారులై తప్ప, గుర్రాల మీదగాని, ఏనుగుల మీదగాని రాలేరు. ఒకవేళ శత్రువులు గుంపులుగా వస్తే, పైనుంచి రాళ్ళు దొర్లించి వాళ్ళను హతమార్చవచ్చు. ఒకరొకరుగా వచ్చేట్టయితే, అక్కడి చెట్ల మీద దాగివుండి, విషపు బాణాలతో వారిని తుదముట్టించవచ్చు." అన్నాడు వృద్ధుడు.

వృద్ధుడి మాటలు నన్ను చాలా సంతోషపరిచినై. తుదకు విజయం బల

వంతుడైన నరవాహనుడిదే అయినా - యీ లోపల అతడు సైనిక నష్టం చాలా భరించవలసివుంటుంది. అదే సమయంలో పట్టణ ప్రాంతాలగల ప్రజలు ఎదురు తిరిగితే అతడి పతనం తప్పదు!

మేము క్రమంగా కొండ ఎక్కసాగాం. ఆ ప్రాంతం అంతగా జన సంచారం ఎరగదన్న సూచనగా - ఎక్కడా నడిచేందుకు మార్గమే కనబడలేదు. మా ముందున్న కోయ యువకులు, పొదలనూ, తీగలనూ నరికి మాకు మార్గం చేయసాగారు.

బాగా మిట్టమధ్యాహ్నం అయేసరికి మేము కొండ ఎక్కి శిథిల దుర్గం చేరాం. అది చాలా ఎత్తయిన కొండ అని అక్కడకు చేరిన తరవాతగాని నాకు బాగా అర్థంకాలేదు. అక్కడ వున్న ఒకానొక శిథిలమైన గోడ మీద నిలబడి చూస్తే మొత్తం కుండలినీ ద్వీపం, దాన్ని అన్నివైపులా ఆవరించివున్న మహా సముద్రం కనిపించాయి.

దుర్గం ఎలాంటి స్థితిలో వుంది? శత్రువుల నుంచి రక్షణకు దీన్ని ఎంతవరకు వుపయోగించుకోవచ్చు? అసలు వాళ్ళు యింత దూరం రాగలరా? ఇలాంటి ఆలోచనలతో నేను ఆ దుర్గాన్ని పరీక్షించసాగాను.

దుర్గం ఒకప్పుడు చాలా బలవత్తరమైనదే అనేందుకు అక్కడ శిథిలస్థితిలో వున్న పెద్ద పెద్ద స్తంభాలూ, గోడలూ సాక్ష్యంగా కనబడుతున్నవి. దుర్గంలో ప్రవేశించేందుకు వున్న పెద్ద ద్వారం తలుపులలో ఒకటి విరిగిపోయి పక్కకు ఒరిగి వున్నది.

"శివదత్తా, మీకు దుర్గం లోపలకు పోయి చూడాలనివుంటే, మా యువకుల్లో ఒకణ్ణి మీ వెంట పంపగలను," అన్నాడు కోయ వృద్ధుడు. అంతలో మా చెవులకు భీకరమైన కేకలూ, ఏనుగుల ఘీంకారాలూ వినిపించినై.

"అదేమిటి?" అంటూ వృద్ధుడు అటుకేసి చూశాడు. —(ఇంకా వుంది)





# మహాకవి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, కార్యసాధన కోసం విసుగూ, విరామం లేకుండా నువ్వు పడుతున్న శ్రమ మెచ్చదగిందే. కాని, చాలామంది అనుకున్న కార్యం సాధించలేక, కోరి అజ్ఞాతజీవితం గడుపుతారు. నువ్వూ. ఏదో ఒకనాడు, నీ ప్రయత్నంలో ఓటమి పొంది, ఏ మారుమూలనో అనామకుడుగా జీవితం వెళ్ళబుచ్చగలవేమో అన్న సంశయం నాకు కలుగుతున్నది. అయితే, ఒక్కొక్కసారి మనం అపజయంగా భావించేది, యితరుల దృష్టిలో ఘన విజయం కావచ్చు. అప్పుడు వచ్చే ప్రశంసలకు మనం ఆనందించాలా లేక

## వేతాళ కథలు



జరిగిన వాస్తవమేమిటో చెప్పాలా? ఇలాంటి సమస్య ఎదురైనప్పుడు ప్రభాకరుడనే కవి ఏమి చేసిందీ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ యిలా చెప్పసాగాడు:

ప్రవాళదేశ రాజధాని ప్రాకారపురంలో ప్రభాకరుడనే కవి వుండేవాడు. అతడు అట్టే కలిగినవాడు కాడు. రాజాశ్రయం సంపాదించేందుకు అతడు ఎన్నో ప్రయత్నాలు చేశాడు. కాని, అంతకుముందే అక్కడ తిష్ఠవేసి కూర్చున్న స్వార్థపరులైన కవి, పండితుల అసూయ కారణంగా అతడికి రాజాస్థానంలో ప్రవేశం దొరకలేదు.

ప్రభాకరుడు యింకా పాతికేళ్ళయినా నిండని యువకుడు. బతుకుతెరువుకు ఏమి చేయడమా అని అతడు ఆలోచిస్తున్న దశలో, హఠాత్తుగా భార్య మరణించింది. అతడు ఆమె అస్థికల్ని గంగానదిలో కలిపేందుకు కాశీయాత్ర బయలుదేరాడు. ఆ తరవాత నగరానికి తిరిగిరాలేదు.

ప్రభాకరుడు ప్రాకారపురం వదిలి వెళ్ళిన చాలా కాలానికి యువరాజు ప్రసేనుడు ప్రవాళదేశానికి రాజయ్యాడు. అతడికి సాహిత్యమన్నా, కవిపండితులన్నా ఎంతో అభిమానం. అతడు స్వయంగా తాళపత్ర గ్రంథాలెన్నో సేకరించి చదువుతూండేవాడు. ఒకసారి ప్రభాకరుడు రాసిన కావ్యం ఒకటి అతడు చదవడం తటస్థించింది. అది అతడికెంతో అద్భుతంగా కనిపించింది.

ఈ విధంగా ప్రభాకరుడి రచనలకు రాజంతవాడి నుంచి గుర్తింపు వచ్చాక, వాటి సంగతి నలుగురికీ తెలియడానికి ఎంతో కాలం పట్టలేదు. దేశంలోని కవి పండితులంతా, ప్రభాకరుడు గొప్ప కవి అనీ, అతడు రాసిన ప్రతి గ్రంథం ఒక మహాకావ్యం అనే దాంట్లో సందేహించవలసిందేమీ లేదనీ రాజుకు చెప్పసాగారు.

ఆస్థానంలో ప్రభాకరుడి కావ్యాలను గురించి తరచు చర్చలు సాగుతూండేవి.



ప్రసేనుడు తనకు నచ్చిన విధంగా వాటిపై వ్యాఖ్యలు చెప్పే పండితులకు మంచి బహుమతులు యిస్తూండేవాడు. ప్రభాకరుడు ఎక్కడ వున్నదీ తెలుసుకునేందుకు రాజు చాలా ప్రయత్నాలు చేశాడు; కాని ఫలితం లేకపోయింది. దానితో ఆయన మరణించి వుండవచ్చని అంతా అభిప్రాయపడ్డారు.

ప్రసేనుడు, ప్రభాకరుణ్ణి ప్రవాళ దేశపు జాతీయ మహాకవిగా ప్రకటించి, ప్రతి సంవత్సరం ఆయన జ్ఞాపకార్థం, రాజధానీ నగరంలో కవి పండిత సదస్సులు ఏర్పాటు చేయసాగాడు. వాటిలో దేశంలోని ప్రముఖ కవి పండితులందరూ పాల్గొని, ప్రభాకరుడి రచనలను ప్రశంసించడమేగాక, వ్యక్తిగా అతడెంత గొప్పవాడైవుంటాడో కూడా తమకు తోచిన విధంగా ప్రసంగాలు చేసేవారు.

ఒకసారి అటువంటి సదస్సులో కవి పండితులందరూ, మహాకవి ప్రభాకరుడి గుణగణాలు వర్ణిస్తున్నారు. కొందరు ప్రభాకరుడి కావ్యాలలోని వంశవర్ణనలను బట్టి చూడగా, అతడు కులీనుడనీ, తాత తండ్రులు కూడా పండితులవడం వల్ల, యీ ప్రతిభ వంశపారంపర్యంగా అతడికి సంక్రమించిందనీ అన్నారు. మరికొందరు అతడిది ఏ విధంగా చూసినా దోషాలు పట్టలేని విద్వత్తన్నారు. ఇంకా కొందరు ప్రభాకరుడు తన కావ్యాల్లో కథానాయికలను ఎంతో మనోహరంగా చిత్రించగలగడానికి కారణం, అప్సరసలను మించిన అందగత్తె అయిన అతడి భార్య కావచ్చునని నిర్ధారణ చేశారు.

ఆ సమయంలో ఒక వృద్ధ పండితుడు సభలో లేచి నిలబడ్డాడు. రాజుతోపాటు అందరూ అతడి కేసి తలలు తిప్పారు.

వృద్ధ పండితుడు చిన్నగా గొంతు సవరించుకుని, "మహారాజుకూ, కవి పండితులకూ, యివే నా నమస్కారాలు. ప్రభాకరుడు చక్కని కావ్యాలు రాశాడనడంలో అర్థముందేమోకాని, అతడికి



లేని అర్హతలను అంటగట్టడం మాత్రం బాగాలేదు,'' అన్నాడు.

సభలో వున్న వాళ్ళలో కొందరు ఆశ్చర్యంగానూ, కొందరు అయిష్టంగానూ వృద్ధుడి కేసి చూశారు.

వృద్ధుడు యివేమీ పట్టించుకోకుండా, ''ప్రభాకరుడు మీరనుకుంటున్నట్టు కులీనుడు కాదు. కొన్ని చిత్రమైన పరిస్థితులలో, ఒక అంత్యజాతి స్త్రీకి జన్మించినవాడు. ఈ సంగతి తండ్రి చేత అతిగోప్యంగా వుంచబడింది. అతడి కవిత్వం కూడా అంత లోపాలు లేనిదేమీ కాదు. అందులో దొర్లిన ఛందోవ్యాకరణ దోషాలు కొన్ని, యింతమంది పండితులలో ఏ ఒక్కరి దృష్టికీ రాకపోవడం ఆశ్చర్యం. మరొకటి: ప్రభాకరుడి భార్య బహు కురూపి,'' అన్నాడు.

సభలో పెద్ద కలకలం రేగింది. ''ఈ ముసలివాడెవరో అసూయవల్లనో, లేక మతిచలించో, మనమంతా అభిమానించే మహాకవిని దుయ్యబడుతున్నాడు. ఇతణ్ణి, యీ సభలో ఒక్క క్షణం కూడా వుండనియ్యరాదు,'' అంటూ కొందరు పండితులు పట్టుబట్టారు.

రాజు ప్రసేనుడు కూడా కోపంగా, ''ఒక మహాకవిని గురించి పరిచయం వున్నవాడివిలాగా మాట్లాడడమే కాక, ఆయన కులీనతను గురించీ, భార్యను గురించీ కూడా అసభ్యంగా పలికావు. ఇంతకూ నువ్వెవరు? నిజం చెప్పకపోతే, నిన్ను కఠినంగా శిక్షించగలను,'' అన్నాడు.

వృద్ధుడు ఒక క్షణకాలం సభలోవున్న వారందరి కేసీ చూసి, ''మహారాజా, ఇక్కడున్న పండితుల్లో, నా వయసు వాళ్ళు కొందరున్నారు. ఎంతో కాలం గడిచినా, నేనెవరైందీ చెప్పిన తర్వాతనైనా వారిలో కొందరు నన్ను గుర్తించగలరనుకుంటాను. అప్పట్లో ముఖ్యంగా నాకు, విష్ణుదీక్షిత పండితుడితో ఎక్కువ పరిచయం వుండేది. మహాకవి అంటూ,

మీరంతా యింత గొప్పగా ప్రశంసించే ప్రభాకరుణ్ణి నేనే!'' అన్నాడు.

ఈ మాటలతో, పండితులు కొందరు, అతణ్ణి గుర్తించి హర్షధ్వానాలు చేశారు. రాజు అతడికి పాదాభివందనం చేశాడు.

బేతాళుడు యీ కథ చెప్పి, ''కవిగా ప్రభాకరుడి గొప్పతనాన్ని గురించి అంతమంది పండితులు మెచ్చుకుంటున్న సమయంలో, ప్రభాకరుడే తనకు సంబంధించిన కొన్ని కఠినసత్యాలను సభలో వెల్లడించడంలో వున్న అంతరార్థమేమిటి? వృద్ధాప్య కారణంగా అతడికి మతిచలించలేదుకదా! ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''ప్రభాకరుడు మాట్లాడిన తీరుచూస్తే, అతడు మహాకవి అనేకాక, వ్యక్తిగా ఎంతో నిజాయితీపరుడన్న సత్యం కూడా వెల్లడవుతుంది. అందువల్ల మతిచలించడం అన్న సమస్యే లేదు. అతడు తనను గురించి కొన్ని కఠిన సత్యాలను బయట పెట్టడానికి చాలా ముఖ్యమైన కారణమే వున్నది. అజ్ఞాతకవిగా అతడు దేశం విడిచి పోయాడు. రాజుకు అతడి రచనలపట్ల వున్న ఆదరాన్ని పురస్కరించుకుని, పండితులు మెప్పుకోసం అతడి కవిత్వాన్నే గాక, ఎరగని అతడి వ్యక్తిగతజీవితాన్ని కూడా ఆకాశానికెత్తేస్తున్నారు. తన తదనంతరం మరికొందరు పండితులు యింకా ఎన్నో అభూతకల్పనలు సృష్టించే అవకాశం కూడా వున్నది. ఈ కారణాల వల్ల, సత్యసంధుడూ, నిజాయితీపరుడూ అయిన ప్రభాకరుడు తనను గురించిన వాస్తవం నలుగురి ముందూ వెల్లడి చేశాడు. ఇందువల్ల వ్యక్తిగతంగా తనుగాని, తన కవిత్వంగాని ముందు, ముందు వాదోపవాదాలకు గురి అయే ప్రమాదం లేకుండా పోతుంది,'' అన్నాడు

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# సమయస్ఫూర్తి

నరసీపట్నంలో అక్కుభొట్లు అనే పేరు గల హరికథకుడు వుండేవాడు. వేదాలూ, శాస్త్రాలూ చదివిన వాడయినా ఆయనకు హరికథలు చెప్పడం అన్నా, నాటకాల్లో వేషాలు వెయ్యడం అన్నా ఆసక్తి ఎక్కువగా వుండేది.

అక్కుభొట్లుది కంచుకంఠం, శ్రావ్యమైన స్వరం. కంఠమెత్తి పద్యం చదివాడంటే, ఊరుకు మరొక చివర వున్న వాళ్ళు కూడా వినగలిగేవాళ్ళు. ఆయన గాన మాధుర్యానికి పరవశించిపోని వాళ్ళుండరు. నరసీపట్నం చుట్టుపక్కల చిన్నకొండలూ, అడవులూ వుండడంతో అక్కుభొట్లు ఎక్కడికి వెళ్లాలన్నా గుర్రం మీద ప్రయాణం చేసేవాడు.

ఒకసారి ఆయన దూరగ్రామాల్లో హరికథలు చెప్పి, నాటకాల్లో వేషాలు వేసి గుర్రం మీద స్వగ్రామానికి తిరిగి వస్తున్నాడు. అడవి మార్గాన గుర్రం ఒక తోడేలును చూసి బెదిరి, అక్కుభొట్లు స్వాధీనం తప్పి, యిష్టమొచ్చినట్టు పరిగెత్తసాగింది. ఒకచోట ఇద్దరు దొంగలు దాన్ని అటకాయించి పట్టుకున్నారు.

గుర్రం స్వాధీనంలోకి వచ్చింది గాని, తను దొంగలబారి పడ్డానని అక్కుభొట్లు గ్రహించాడు. ఇప్పుడేం చేయడమా అని ఆయన ఆలోచిస్తున్నంతలో, దొంగల్లో ఒకడు చురకత్తి చూపుతూ, "ఓయ్, హరికథల అయ్యవారూ! అట్టే గొడవ చెయ్యక గుర్రం దిగి, దగ్గిరున్న మూటాముల్లే యిచ్చెయ్యి!" అన్నాడు.

అక్కుభొట్లు దగ్గిర కొంత డబ్బుతో పాటు, కొందరు గ్రామపెద్దలు ఆయన నటనకూ, పాటకూ మెచ్చి ఇచ్చిన వెండి, బంగారు వస్తువులు కూడా వున్నవి. ఇంత డబ్బు చూస్తూ, చూస్తూ దొంగలపాలు

ఎన్. వి. ఆర్. సత్యనారాయణమూర్తి

చెయ్యవలసిరావడంఅక్కుభొట్లుకు చాలా బాధ అనిపించింది.

ఆయన నిబ్బరంగా గుర్రం దిగి, దొంగలతో, "నా దగ్గిరున్న కొద్దిపాటి డబ్బూ, మీకు సంతోషంగా యిచ్చేస్తాను. కాని, నా కొకటే విచారం. అడవిలో యీ మాయదారి గుర్రం నన్ను దారి తప్పించింది. ఈ రాత్రికి మా వాళ్ళు దొమ్మల గూడెంలో ఆడే నాటకంలో, నేను రెండు పాటలూ, ఐదు పద్యాలూ పాడవలసి వున్నది. వాటిని శ్రమపడి వారం రోజులుగా కంఠస్థం చేశాను. దారి తప్పాను గనక ఎలాగూ నేనీ రాత్రి నాటకంలో వేషం వెయ్యలేను. నేను, మీకు ఒకటి రెండు పాటలూ, పద్యాలూ వినిపిస్తాను. మీకే మైనా సంతోషం కలిగితే, మా ఊరు చేరేందుకు దారి చూపాలి," అన్నాడు.

దొంగలు అక్కుభొట్లు యిచ్చిన డబ్బు మూట తీసుకుని ఆనందపడిపోతూ, "సరే, అలాగే పాడవయ్యా, హరిదాసూ! పాట బావున్నా లేకపోయినా, మీ ఊరు చేరేందుకు దారి చూపుతాంలే," అన్నారు.

అక్కుభొట్లు గొంతెత్తి శ్రావ్యంగా ఒక పాట పాడేసరికి, దొంగలు ఆశ్చర్యపోతూ, "ఆహా, ఇంత బాగా పాడగలవా! ఏదీ మరొక పాట పాడు," అన్నారు.

ఈసారి అక్కుభొట్లు గొంతెత్తి పద్యాలు చదవడం ప్రారంభించాడు. దొంగలు ఆయన కంఠమాధుర్యానికి తమను తాము



మరిచిపోయారు. అక్కుభొట్లు స్వరం హెచ్చించి, రంగస్థలం మీద పాడు తున్నట్టుగా పద్యాలు చదవసాగాడు.

ఇలా ఒక గంటకాలం గడిచిపోయింది. అక్కుభొట్లు పాడడం ఆపి దొంగల కేసి చిరునవ్వు నవ్వుతూ చూశాడు. దొంగలు అప్పటికి తేరుకుని, వెనక ఏదో చప్పుడు కావడంతో తలలు తిప్పారు. నలుగురు దృఢకాయులు చేతగొడ్డళ్ళతో నిలబడి వున్నారు. దొంగలిద్దరూ భయంతో వణికి పోయారు.

వాళ్ళు దొంగలిద్దర్నీ తాళ్ళతో కట్టి బంధిస్తూండగా, అక్కుభొట్లు, "దొంగల్ని పట్టేందుకు ఆయుధాలతో సహా వచ్చారు, మీ రెవరు?" అని అడిగాడు.

"మే మీ అడవికి కట్టెలు కొట్టుకు నేందుకు వస్తూంటాం. అడవంతా మారు మోగే మీ గొంతు విని యిక్కడికి వచ్చాం. వీళ్ళు మల్లన్నా, చిక్కన్నా అనే పేరు మోసిన దారిదోపిడీ దొంగలు," అన్నారు కట్టెలు కొట్టుకునేవాళ్ళు.

"అయితే, నా ఎత్తు పారిందన్న మాట! గొంతెత్తి పెద్దగా పాడే నా పద్యాలు విని ఎవరో ఒకరు సాయం వస్తారను కున్నాను. అంతే జరిగింది," అన్నాడు అక్కుభొట్లు తృప్తిగా.

కట్టెలు కొట్టేవాళ్ళ గ్రామం అక్కడికి దాపుల్లోనే వున్నది. వాళ్ళు దొంగలను వెంట బెట్టుకుని ముందుండి దారి తీయగా, అక్కుభొట్లు గుర్రం మీద వాళ్ళను అనుసరించాడు.

గ్రామపెద్ద జరిగినదంతా విని, అక్కుభొట్లు సమయస్ఫూర్తిని చాలా మెచ్చుకుని, "మిమ్మల్ని గురించి లోగడే వినివున్నాం, ఈ రాత్రి తమరు మా గ్రామంలో ఏదైనా హరికథ చెప్పాలి. మాది పేద గ్రామం, అయినా తృణమో, పణమో యిచ్చుకోగలం," అన్నాడు.

అక్కుభొట్లు అందుకు సంతోషంగా ఒప్పుకుని, ఆ రాత్రి తన శ్రావ్యమైన కంఠ స్వరంతో గ్రామస్థులందరికీ మితిలేని ఆనందం కలిగించాడు.






వీరవరం గ్రామంలో సంపన్న గృహస్థులైన రామనాథం, పార్వతి ఆదర్శ దంపతులు. వాళ్ళకు పిల్లలు లేరు. ఇంటికి ఎవరొచ్చినా బాగా ఆదరిస్తారని పేరుబడ్డారు.

ఒకసారి వాళ్ళింటికి గోపాలం అనే కుర్రవాడు వచ్చాడు. వాడు ఏదో దూరపు వరసలో రామనాథానికి బంధువు అవుతాడు. గ్రామంలో పని వుండి వచ్చిన గోపాలం, ఆయన ఇంట్లో ఒక్కపూట మాత్రం భోజనం చేశాడు. ఆ తరవాత ఎక్కడో భోజనం చేసి వస్తూండేవాడు.

గోపాలం ధోరణికి పార్వతి ఎంతగానో నొచ్చుకుని, "అనవసరంగా మొహమాట పడకు, నాయనా! మరొక్కడికి వంట చేయడం, నా కేం శ్రమాకాదు; భరించ లేకపోవడాని కిదేమంత ఖర్చు కాదు; అలాగని నువ్వు పరాయివాడివీకాదు," అన్నది.

పార్వతి యింత చెప్పినా కూడా గోపాలం బయటనే భోజనం చేసి వచ్చి, ఏవో సాకులు చెబుతూండేవాడు.

ఇలా నాలుగైదు రోజులు జరిగాక, పార్వతి భర్తతో, "ఆ కుర్రాడు మరీ మొహమాటస్థుడిలా వున్నాడండీ! మన యింట్లో వుంటూ, పరాయి యింట్లో భోజనం చేస్తూంటే, మీ బంధువులు నన్నాడిపోసుకోరూ!" అన్నది.

"ఏం చేస్తాం, అసలే నాకు అజీర్ణ రోగం కదా? నేను సరిగ్గా భోజనం చెయ్యను. నాతో పాటు భోజనానికి కూర్చుంటే, ఆ కుర్రాడికి నాకంటే ఎక్కువ తినడానికి మొహమాటంగా వున్నట్టుంది," అన్నాడు రామనాథం.

గోపాలం ఆ ఊళ్ళో పదిరోజులుండి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత కొన్నాళ్ళకు, పొరుగూరికి ఎవరో గొప్ప వైద్యుడు

"వసుంధర"



వచ్చాడని పార్వతికి తెలిసింది. ఆమె, రామనాథాన్ని, ఆ వైద్యుడి దగ్గిరకు వెళ్ళి, వైద్యం చేయించుకోమని పోరసాగింది.

ఆ ఊళ్ళో రామనాథానికి దూరపు బంధువొకాయన వున్నాడు. భార్య పోరు భరించలేక ఆయన భార్యతో సహా బయల్దేరి ఆ ఊరు వెళ్ళి, బంధువు యింట మకాం పెట్టాడు.

''అజీర్ణవ్యాధి వుంటేనేం, నేను బాగానే తిరుగుతున్నానుగదా ? వైద్యం చేయించుకోమని మా ఆవిడ ఒక్కటే పోరు,'' అన్నాడు రామనాథం బంధువుతో.

పార్వతి కల్పించుకుని, ''చూడండన్నయ్యగారూ ! రోగం పేరు చెప్పి, యీయన నాలుగు మెతుకులు మింగి లేవడం అలవాటయింది. ఇంటికొచ్చిన బంధువులు యిది చూసి, తామూ అర్ధాకలితో లేచిపోతున్నారు. వాళ్ళకోసమైనా, ఈయన వైద్యం చేయించుకోవద్దా ?'' అన్నది.

ఆ మాటలకు బంధువు నవ్వి. ''చూడమ్మా, పార్వతీ ! నీ వెర్రిగాని, యీ రోజుల్లో మొహమాటపడే బంధువులెక్కడమ్మా ? మరి నాకు తిన్నది అట్టే అరగదు ! అయినా, మా ఇంటికొచ్చిన బంధువులు, అడిగి మరీ ఆ యీ పిండివంటలు చేయించుకు తిని పోతారు. మా ఆవిడ చెయ్యి తగిలిందంటే, పచ్చగడ్డి కూడా కొత్తిమీరగా మారిపోతుంది,'' అన్నాడు.

ఆ రాత్రి రామనాథం ఇంటావిడను పదార్థాలన్నీ మరీ మరీ అడిగి భోజనం చేశాడు.

పార్వతి కూడా వంట చాలా బాగున్నదని గుర్తించింది. అయితే, ఎన్నడూ కడుపారా భోంచేయని తన భర్త, వారి ఇంట అవురావురుమంటూ తినడం ఆమెకు బాధ కలిగించింది.

''ఈ ఊళ్ళోకి రాగానే, ఈయనకు ఎక్కడలేని ఆకలి పుట్టుకొచ్చినట్టుంది ! ఎన్నడూ యిలా భోం చేయలేదు,''

అన్నది పార్వతి భర్త వంక గుర్రుగా చూస్తూ, ఆయన బంధువుతో.

"అదంతా, మా ఆవిడ వంట మాహాత్మ్యం. ఆ మధ్య వచ్చిన గోపాలమూ యింతే. రోజూ ఏదో ఒక పిండి వంట చెయ్యమని వేధించేవాడు," అన్నాడు రామనాథం బంధువు.

"ఏ గోపాలం?" అని అడిగింది పార్వతి ఆశ్చర్యంగా.

బంధువు చెప్పిన వివరాలనుబట్టి, తమ ఇంటికి వచ్చిన గోపాలమే యిక్కడికీ వచ్చి కొద్దిరోజులపాటు వుండివెళ్ళాడనీ, తిండి విషయంలో ఎలాంటి మొహమాటం చూపలేదనీ, పార్వతికి అర్థమైంది.

బంధువు కొంచెంసేపాగి పార్వతితో, "అజీర్తి రోగానికి వైద్యమంటూ, మీ ఆయన్ని ఈ ఊరు తీసుకొచ్చి పెద్ద పొరబాటు చేశావు. నా అనారోగ్యానికి ఎన్ని మంచి మందులు మింగినా, ఇల్లాలి రుచికరమైన వంట కారణంగా, నాకు పథ్యం సాగడంలేదు. ఇక్కడ వుంటే మీ ఆయనకీ నా ఖర్మే పడుతుంది," అన్నాడు.

ఇదంతా విన్నాక పార్వతికి చాలా అవమానం అనిపించింది. ఆ రాత్రి ఆమె భర్త దగ్గిర, "మీ చుట్టం, తన



పెళ్ళాం గురించి అంత గొప్పగా చెబుతూంటే, మీరు నా గురించి ఒక్క మంచి మాట అనలేదేమండీ?" అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నది.

"నన్నేమనమంటావు? అసలే నాకు మొహమాటం. ఆయన పొగిడినట్టు, నేను నా వాళ్ళను పొగడలేను," అన్నాడు రామనాథం.

"నిజంగా మీకు మొహమాటమే అయితే, అది భోజనం దగ్గిర చూపించలేదేం? అన్నీ మళ్ళీ మళ్ళీ అడిగి వేయించుకున్నారు. ఇంటి దగ్గిర అలా ఎప్పుడైనా చేశారా?" అన్నది బాధగా పార్వతి.

"అందుకూ మొహమాటమే కారణం! ఆయనేమో భార్య వంటను మహా పొగిడేస్తున్నాడు. అలాంటప్పుడు విని వూరుకోవడం మర్యాదవుతుందా? అందుకే, కూరలూ అవీ ఒకటికి, రెండుసార్లు అడిగి వేయించుకున్నాను," అన్నాడు రామనాథం.

"అదేం కాదు. నన్ను వెర్రిబాగుల దానికింద జమకట్టి మాట్లాడకండి. ఆ గోపాలం, మీరూ కూడా పనిగట్టుకుని, యీ ఇంట్లో నా పరువు తీసేందుకు యింత నాటకం ఆడారు. అతనూ, ఈయనా కూడా నాకేం కారు, మీ తరఫు బంధువులే కదా!" అంటూ పార్వతి చిన్నగా ఏడ్వ ప్రారంభించింది.

రామనాథం ఆమెను బతిమాలుతూ, "ఈ స్వల్పానికి ఏడ్వడమెందుకు! నువ్వు బాధపడతావని యిన్నాళ్ళుగా వూరుకున్నాను గానీ, నేను నిజంగా మొహమాటస్థుణ్ణని యిప్పుడే రుజువు చేయగలను," అన్నాడు.

పార్వతి తక్కున ఏడ్వడం మాని, "ఆ రుజువు చేయడం ఏమిటో చెప్పండి?" అన్నది.

రామనాథం ఒకటి, రెండు క్షణాలు తటపటాయించి, "నిజానికి నాకు అజీర్తి రోగం లేదు. నీ వంట బాగుండదు. ఆ సంగతి చెబితే నువ్వు నొచ్చుకుంటావని, ఇంట్లో పిట్టతిండితో సరిపెట్టుకుని, నీకు తెలియకుండా పూటకూళ్ళ ఇంట్లో కడుపు నిండా భోజనం చేస్తున్నాను. నేను, కట్టుకున్న భార్య దగ్గిరే మొహమాట పడే వాణ్ణనడానికి, ఇంతకంటే మరేం రుజువు కావాలి?" అన్నాడు.

పార్వతి తెల్లబోయింది. మర్నాడే వాళ్లు తమ గ్రామానికి తిరిగిపోయారు. రెండు రోజుల తరవాత పార్వతి, వంట చేయడంలో సిద్ధహస్తురాలని పేరుమోసిన ఒకావిణ్ణి వంటమనిషిగా కుదుర్చుకున్నది. రామనాథం మరేనాడూ తన అజీర్తిరోగాన్ని గురించిన ప్రస్తావన భార్య దగ్గిర తేలేదు.






బ్రహ్మదత్తుడు కాశీ రాజ్యాన్ని పరిపాలించే కాలంలో ఉత్తర పాంచాల దేశపు రాజధాని అయిన కాంపిల్య నగరానికి పాంచాలుడు రాజుగా ఉండేవాడు. ఆయన భోగలాలసుడూ, అవినీతిపరుడూ అయి, రాజ్యపరిపాలన విషయంలో కొంచెం కూడా శ్రద్ధ వహించలేదు. యథా రాజా, తథా ప్రజా అన్నట్టు, రాజునుబట్టి మంత్రులు కూడా అవినీతిగా ప్రవర్తించసాగారు. ప్రజలపై పన్నుల భారం హెచ్చసాగింది. అరాజకం తలఎత్తింది.

ఈ అరాజక స్థితిలో ప్రజల జీవితం తారుమారయింది. పగలు రాజభటుల పీడా, రాత్రి దొంగల పీడా హెచ్చిపోయింది. అందుచేత నగరవాసులు తమ ఇళ్ళకు తాళాలు పెట్టి, వాకిళ్ళకు ముళ్ళకంపలు అడ్డం పెట్టి, తమ భార్యాబిడ్డలతో అరణ్యానికి వెళ్ళి అక్కడ తలదాచుకోసాగారు. వాళ్ళు పగలల్లా అడవిలో గడిపి, అర్ధరాత్రివేళ తమ ఇళ్ళకు వస్తూండేవారు.

ఈ సమయంలో బోధిసత్త్వుడు నగరం వెలుపల వుండే ఒక తిందుకవృక్షానికి అధిష్ఠాన దేవతగా జన్మించాడు. రాజు ఆ వృక్షానికి ఏటా పూజలు జరిపి, దాని కింద వెయ్యి మాడలు ఖర్చు చేసేవాడు. "అయ్యో, నన్ను ఇంత శ్రద్ధాభక్తులతో ఆరాధించే ఈ రాజు అవివేకంవల్ల తన దేశానికి అరాజకం తెచ్చి పెట్టుకుంటున్నాడు. ఇతనికి సరి అయిన ఉపదేశం చెయ్యటానికి నేను తప్ప ఇంకెవరూ లేరు!" అనుకున్నాడు తిందుకదేవుడు.

ఆయన ఒక రాత్రి నిద్రిస్తున్న రాజుకు ప్రత్యక్షమై, "రాజా, నేను తిందుకదేవుణ్ణి. నీకు సరి అయిన బోధ చెయ్య వచ్చాను!'" అన్నాడు.



రాజుకు జ్ఞానోదయమయింది. అయన తన రాజ్యం ఎలా ఉన్నదీ స్వయంగా చూడటానికి నిశ్చయించుకున్నాడు. మర్నాడు ఉదయమే అయన తన మంత్రులను పిలిచి రాచకార్యాలు చూస్తూ ఉండమని నియోగించి, తన పురోహితుణ్ణి వెంటబెట్టుకుని, తూర్పు ద్వారంకుండా నగరం దాటి మారువేషంతో బయలు దేరాడు.

నగరం వెలపల ఒక ఇంటి ముందు వృద్ధుడొకడు కనిపించాడు. ఆయన ఇల్లు తాళం పెట్టి, ఇంటి చుట్టూ ముళ్ళకంప పెట్టి భార్యా బిడ్డలతో అడవికి పారి పోయాడు. చీకటి పడగానే అయన తన ఇంటికి తిరిగివచ్చి, వాకిలి తీయబోతూం డగా కాలిలో ఒక ముల్లు గుచ్చుకున్నది. వెంటనే ఆయన నేలపై చతికిలబడి, కాలిలో గుచ్చుకున్న ముల్లును తీసు కుంటూ, "నా అరికాలిలో ఈ ముల్లు గుచ్చుకున్నట్టే పాంచాల రాజుకు యుద్ధంలో బాణం గుచ్చుకొనుగాక!" అని తిట్టుకున్నాడు.

ఈ తిట్టు విని రాజపురోహితుడు ఆ వృద్ధుణ్ణి సమీపించి, "అయ్యా, తమరు వృద్ధులు. కన్ను సరిగా కనిపించక మీరు ముల్లు తొక్కితే అది రాజుగారి దోషం ఎలా అయింది?" అని అడిగాడు.

"ఏమిటా బోధ?" అని రాజు భక్తి పూర్వకంగా అడిగాడు.

"రాజా, నీ రాజ్యం నాశనమయి పోతున్నది. అశ్రద్ధగా పరిపాలించే రాజు ఈ లోకంలో తన రాజ్యాన్ని పోగొట్టుకుని, పరలోకంలో నరకం అనుభవిస్తాడు," అన్నాడు తిందుకదేవుడు.

"దేవా, నే నిప్పుడేం చెయ్యాలి?" అని అడిగాడు రాజు.

"ఇప్పటికైనా నీ రాజ్య పరిపాలన విషయాలను నీవే స్వయంగా చూసుకుని అరాజకాన్ని తొలగించి, రాజ్యాన్ని కాపాడుకో!" అని తిందుకదేవుడు అదృశ్యుడయాడు.

"రాజు అవినీతిపరుడైనందు చేతనే అధికారులు దుష్టులైనారు. పగలు రాజభటుల బాధా, రాత్రి దొంగల బాధా భరించలేక ప్రజలు ఇళ్ళకు ముళ్ళ కంపలు అడ్డంపెట్టి, భార్యా బిడ్డలతో అడవికి పారిపోతున్నారు. లేకపోతే నా కాలిలో ఈ ముల్లు విరగవలసిన పనేమిటి?" అన్నాడు వృద్ధుడు.

రాజూ, పురోహితుడూ ఇంకొక గ్రామానికి వెళ్ళారు. అక్కడ వారికొక స్త్రీ కనిపించింది. ఆమెకు యుక్తవయసు వచ్చి ఇంకా పెళ్ళిగాని కుమార్తెలు ఇద్దరున్నారు. వారిని అడవికి తీసుకపోవటం ఇష్టంలేక ఆమె తన ఇంటనే దాచివుంచి, ఇంటికి కావలసిన కట్టెలూ, ఆకులూ తానే తెస్తూవుండేది. ఇప్పుడామె ఏవో ఆకులు కొయ్యటానికి ఒక చెట్టెక్కి దానిపై నుంచి కిందపడి, "ఈ రాజు చచ్చిపోను! వీడు బతికుండగా కన్యలకు పెళ్ళిగీత కూడా లేదు!" అన్నది.

ఈ మాటలు విని పురోహితుడు ఆమెను సమీపించి, "బుద్ధిహీనురాలా, రాజ్యంలో ఉండే ప్రతి కన్యకూ భర్తను వెతకటమే రాజుగారి పనా?" అన్నాడు.

"పగలు రాజభటుల భయం, రాత్రి దొంగల భయం. కన్యలకు భర్తలెలా దొరుకుతారు?" అన్నదా స్త్రీ.



రాజూ, పురోహితుడూ అక్కడినుండి బయలుదేరి ఇంకా ముందుకు వెళ్ళారు.

ఒక పొలాన్ని దున్నుతూ ఒక రైతు వారి కంట పడ్డాడు. అతను దున్నుతూ వుండగానే నాగలికర్రు గుచ్చుకుని ఒక ఎద్దు పడిపోయింది. వెంటనే ఆ రైతు పట్టలేని కోపంతో, "ఈ పాంచాల రాజు గుండెలో బల్లెం గుచ్చుకుని ఇలాగే పడిపోరాదా? మా కష్టాలు తీరుతాయి!" అన్నాడు.

పురోహితుడు రైతుతో, "ఏమోయ్! నీ అశ్రద్ధవల్ల ఎద్దుకు దెబ్బ తగిలి పడిపోతే అందులో రాజుగారి తప్పేమిటి?" అన్నాడు.

"రాజుగారి తప్పు కాకపోతే ఎవరి తప్పు? పాలకులు దుర్మార్గులయితే బక్కవాళ్ళేం బతుకుతారు? పగలు రాజభటుల భయం, రాత్రి దొంగల భయం. నా భార్య, నా కోసం వండి తెచ్చిన కూడు బలవంతంగా లాక్కుని దుర్మార్గులు మెక్కేశారు. మళ్ళీ వండి ఎప్పుడు తెస్తుందా అని నేను నోరు తెరుచుకు చూస్తుండటం మూలాన బంగారమంటి ఎద్దు కాస్తా దెబ్బ తిని పడిపోయింది!" అన్నాడు రైతు.

అక్కడినుండి బయలుదేరి రాజూ, పురోహితుడూ తమ రాజధానికి పోసాగారు. దారిలో వారికొక దృశ్యం కనిపించింది. ఒక మడుగులో వున్న కప్పలను, బతికి వుండగానే కాకులు పొడుచుకు తింటున్నాయి.

ఆ కప్పలలో ఒకటి క్రోధావేశంతో, "ఈ కాకులు మమ్మల్ని ఎలా బతికి వుండగానే పీక్కు తింటున్నాయో అలాగే పాంచాల రాజునూ, అతని సంతానాన్నీ శత్రువులు పీక్కు తిందురుగాక!" అన్నది.

"ఓసి మతిమాలిన కప్పా! మిమ్మల్ని పీక్కుతినే కాకుల్ని ఏమీ అనలేక రాజుగారికి శాపనార్థాలు పెడుతున్నావా?" అన్నాడు పురోహితుడు కప్పతో.

దానికి కప్ప, "రాజుగారిని తృప్తి చెయ్యటానికి పురోహితుడు అలాగే అడుగుతాడు. ఆశ్చర్యంలేదు. కాని దేశంలో కాకబలులు కూడా కరువైపోబట్టేగదా కాకులకు బతికున్న కప్పల్ని పీక్కుతినే దుస్థితి పట్టింది. అటువంటి రాజు ఛస్తే ఎంత మేలు!" అన్నది.

అది విని రాజు, "నన్ను కప్పలు కూడా శపిస్తున్నాయి. ఇక లాభం లేదు. మనం నగరానికి తిరిగివెళ్ళి, ఈ అరాజకాన్ని తుదముట్టించుదాం!" అన్నాడు.

ఆ ప్రకారమే ఆయన రాజ్యపాలనలో శ్రద్ధ చూపి, లోపాలను సవరణ చేసి, ప్రజలకు శాంతిసౌఖ్యాలు కలిగేలాగు చాలా కాలం పరిపాలన సాగించాడు.






# చిత్తూరు రాణి పద్మిని

పదమూడవ శతాబ్దంలో, మేవారు రాజ్యానికి చిత్తూరు రాజధాని. అది ఒక ఎత్తయిన కొండపై నిర్మించబడిన బలమైన దుర్గం. దుర్గప్రాంతం ప్రకృతి శోభతో కనుల పండువుగా వుండేది. మేవారు పరిపాలకులను రాణాలు అనేవారు.

పదమూడవ శతాబ్దం ముగియనున్న కాలంలో, మేవారుకు రాణా రతన్‌సింగు రాజు. ఆయన భార్య రాణీ పద్మిని అతిలోక సౌందర్యవతి. ఆమె అంద చందాలను గురించి రాచకుటుంబాల వాళ్ళు గొప్పగా చెప్పుకునేవాళ్ళు.





ఆ కాలంలో అలా ఉద్దీన్ ఖిల్జీ ఢిల్లీకి సుల్తాను. అతడు గుజరాతులో చాలా భాగం జయించాడు. అతడికి తాను గొప్పవిజేత నన్న గర్వం వుండేది. దర్బారులోని నాట్యకత్తెల ద్వారా అతడు పద్మిని సౌందర్యాన్ని గురించి విన్నాడు. సంపన్నమైన రాజస్థాన్‌ను ఆక్రమించుకునేందుకు అతడు అనరికే వ్యూహం పన్నుతున్నాడు.




అలాఉద్దీన్ విపరీతమైన రాజ్యతృష్ణ కలవాడు. తాను గొప్ప చక్రవర్తినని పించుకోవాలనీ, అత్యంత సౌందర్యవతి తనకు రాణీ కావాలనీ అతడు కలలు కంటూండేవాడు. పెద్ద సైన్యాన్ని సమకూర్చుకుని అతడు చిత్తూరు మీదికి దాడి బయలుదేరాడు. యుద్ధ సన్నద్ధుడు కాని రాణాను తేలికగా లోబరుచుకోవచ్చునని అలాఉద్దీన్ ఆశ పడ్డాడు.

కాని, అతడి ఆశ నిరాశగా పరిణమించింది. పరాక్రమవంతులైన రాజపుత్రులు అతణ్ణి నిలువరించి, ఎదురు దాడి చేశారు. అలాఉద్దీన్ చాలా ఆశ్చర్యపడ్డాడు. ఈనాటివరకూ అంత ధైర్యశాలురైన శత్రువులను అతడు చూసి వుండలేదు. అతడి సైన్యం తిరోగమించవలసివచ్చింది.





అలాఉద్దీన్ ఎత్తుగడలు మార్చాడు. చిత్తూరు దుర్గం వున్న కొండను సైన్యంతో చుట్టుముట్టాడు. ఆ విధంగా దుర్గంలో వున్నవాళ్ళకు బయటినుంచి అహారపదార్ధాలు చేరకుండా చేయాలనుకున్నాడు. ఇందువల్ల స్వల్పకాలంలోనే రాణా తనకు లొంగిపోగలడనుకున్నాడు. కాని, నెలలు గడిచినా అలా జరగలేదు. అలాఉద్దీన్ యిప్పుడేమి చేయడమా అన్న అలోచనలో మునిగిపోయాడు.

చిట్టచివరకు అలాఉద్దీన్, రాణాకు ఒక సందేశం పంపుతూ, తనకు ఒక్కసారి పద్మినిని చూసే అవకాశం కలిగిస్తే, ముట్టడి ఎత్తివేసి ఢిల్లీకి పోగలనన్నాడు. తన ఓటమిని కప్పిపుచ్చుకునేందుకు అలాఉద్దీన్ యిలాంటి కోర్కె కోరాడని రాణా భావించాడు. అతడు మంత్రులతో, రాణీ పద్మినితో సంప్రతించాడు.






ఒక అద్దంలో పద్మిని ప్రతిబింబాన్ని అలాఉద్దీన్ చూసేందుకు ఒప్పుకోవడం ఉచితంగా వుంటుదన్న నిర్ణయం జరిగింది. ఆ విధంగానే అలాఉద్దీన్‌ను సగౌరవంగా ఆహ్వానించి ఒక గదిలోకి తీసుకుపోయారు. అతడు ఒక గవాక్షానికి ఎదురుగా వున్న పెద్ద అద్దం ముందు నిలబడ్డాడు.

ఆ గవాక్షం వెనక వున్న సరస్సులో, ఒక రాజప్రాసాదం వున్నది. పద్మిని డాబాపైగల పిట్టగోడ దగ్గరకు వచ్చింది. అలాఉద్దీన్ అద్దంలో ఆమె ప్రతిబింబాన్ని చూసి ముగ్ధుడైపోయాడు. తృటికాలంలో ప్రతిబింబం కనబడకుండా పోయింది.





రాజపుత్ర సంప్రదాయ గౌరవాలకు అనుగుణంగా రాణా రతన్‌సింగు ఒంటరిగా తన అతిథి అయిన అలాఉద్దీన్‌ను దుర్గద్వారాల వరకు తీసుకుపోయాడు. అలాఉద్దీన్ తనకు జరిగిన మర్యాదకు రాణాను ఎంతగానో అభినందించాడు. ఆ సమయంలో రాణా చేతిని తన గుప్పెటలో బిగించి పట్టుకుని అలాఉద్దీన్ అతణ్ణి ఒక్కొక్క మెట్టే దింపుతూ దుర్గం బయిటికి తీసుకుపోయాడు.

ఈ విధంగా అలాఉద్దీన్ నక్కజిత్తులతో రాణాను కొండ దిగువకు నడిపించాడు. అక్కడ రాళ్ళ వెనకా, పొదలచాటునా దాగివున్న అలాఉద్దీన్ సైనికులు హఠాత్తుగా బయిటికి వచ్చి, రాణా రతన్ సింగును పట్టుకుని, అలాఉద్దీన్ గుడారాలకు తీసుకుపోయారు.






అలాఉద్దీన్ యింతటి అత్యాచారానికి పూనుకుంటాడని ఊహించని దుర్గద్వార రక్షకులు యీ జరిగింది చూసి నిశ్చేష్టులయారు. రాజపుత్ర సైనికులు తమ రాజును రక్షించేందుకు అలాఉద్దీన్ గుడారాల మీద దాడికి బయులుదేరారు. గుడారాల మీద దాడి జరిపితే, రాణాను వధించగలమని అలాఉద్దీన్ సైనికులు వాళ్ళను హెచ్చరించారు.

— (వచ్చే సంచికలో ముగింపు)

# అవిటి సైనికుడి ఆంతర్యం

నగరానికి వెళ్ళే రాజమార్గం పక్కనవున్న ఒక పళ్ళతోటలో మునీశ్వరు డొకడు తన శిష్యులతు జ్ఞానబోధ చేస్తున్నాడు. శిష్యుల్లో కొందరు ఆయన మాటలు శ్రద్ధగా ఆలకిస్తున్నారు; మరికొందరు అవేమీ పట్టించుకోకుండా తమలో తాము గుసగుసలాడుతున్నారు.

ఆ సమయంలో, యుద్ధంలో ఒక కాలు పోగొట్టుకున్న సైనికు డొకడు గుర్రం మీద నగరానికి పోతూ అక్కడ ఆగి, ముని చెప్పేది వినసాగాడు.

తమ గురువుగారి బోధలంటే ఆసక్తిలేని శిష్యులిద్దరు సైనికుడితో, "మా గురువుగారు గొప్ప మహత్తు కలవాడు! ఆయన్ని ప్రార్థిస్తే, నీ పోయిన కాలు తిరిగి వస్తుందని ఆశ పడుతున్నావా?" అన్నారు వేళాకోళంగా.

అవిటి సైనికుడు శిష్యుల కేసి శాంతంగా చూస్తూ, "నేను కష్టజీవిని. ఒకళ్ళ దయా దాక్షిణ్యాల మీద ఆధారపడి జీవించాలని కోరుకోను. నేను యిక్కడ ఆగింది, ముని నా పోయిన కాలు తిరిగి తన మహత్తుతో యిస్తాడని కాదు; అవిటివాడినైనా ధైర్యంగా జీవించేందుకు తన తత్వబోధతో శక్తి యిస్తాడేమోనని!" అని, గుర్రాన్ని అదిలించి అక్కణ్ణించి బయలుదేరాడు.

ఆ మాటతో ముని శిష్యులు తామెంత అజ్ఞానంలో వున్నదీ గ్రహించి, సిగ్గుతో తలలు వంచుకున్నారు.

—ఎమ్. డి. సౌజన్య





# ఆడపడుచుమాట

కొపవరంలో కామయ్యశెట్టి అనే అతను ఒకడుండేవాడు. అతనికి ధనాలు అనే భార్య ఉండేది.

కామయ్య పెద్దవాడు కావటంచేత తన వ్యాపారమంతా ఇద్దరు కొడుకులకూ వప్పజెప్పి, భార్యతో, "నువ్వు కూడా ఇంటి పెత్తనం కోడళ్ళ మీద పెట్టేసి నాతో రా. రోజూ సాయంత్రం వెళ్ళి పురాణం విని వద్దాం," అన్నాడు.

"అలాగే నడవండి. పురాణమే గదా. డబ్బిచ్చి చూచేది గనకనా, రాననటానికి?" అని అంటూ, రోజూ భర్తతో శివాలయానికి వెళ్ళి, సూరిశాస్త్రులుగారి పురాణం విని వస్తూండేది.

పురాణం ఆరంభించి, పూర్తి అయే వరకూ కామయ్య ఎంతో శ్రద్ధగా వింటూండేవాడు. ధనాలు కూడా వింటూండేది గాని, ఆవిడకు ఒక్కొక్కప్పుడు విసుగేసుకొచ్చి పోదామా అనిపించేది. కాని, పూర్తి అయేవరకూ ఉంటే ప్రసాదం ముడుతుంది కనక, చివరిదాకా ఓపికగా కూర్చునేది.

ప్రసాదం క్రింద ముట్టిన వడపప్పో, పంపరపనసతొనో, అరటిపండు ముక్కలో భద్రంగా పట్టుకెళ్ళి, తన కూతురు కాసులమ్మ చేతిలో పడవేసేది. ఎప్పుడూ కూతురు చేతులలోనే పడేసేది కాని, ఇద్దరు కోడళ్లనూ చక్కా పిలిచి, ఇదిగో నర్రా అని ఒక్కనాడు కూడా ఆ ప్రసాదం ఇచ్చేది కాదు.

ఆఖరికి ఒకనాడు కామయ్యే కలగజేసుకొని, "ఎప్పుడూ కోడళ్ళ చేతిలో విదల్చవేమి? ఇంత పక్షపాత మేమిటని అనుకోరా వాళ్ళు? కోడళ్ళని కూడా కూతుళ్లతో సమంగా చూసుకోవాలి సుమా," అన్నాడు.

భర్త ఇలాగ అనేసరికి తన సంగతి మగవాళ్ళకి కూడా తెలిసిపోయిందే అనీ, కోడళ్ళని సరిగ్గా చూడటం లేదని తెలిస్తే, కొడుకులకు తన మీద గౌరవం తగ్గిపోతుందనీ అనిపించి, ఇంక పెట్టుపోతల్లో జాగ్రత్తగా వుండాలి అని నిశ్చయించుకుంది, ధనాలు.

ఆవిడ ఆ నిశ్చయానికి వచ్చిన మర్నాడు పురాణంలో సూరిశాస్త్రులుగారు శ్రీరాముల వారి జననాన్ని గూర్చి యిలా చెప్పేరు:

"పుత్రుల కోసం దశరథుడు పుత్రకామేష్టి యాగం చెయ్యగా, హోమ గుండంలోంచి అగ్నిహోత్రుడు వచ్చి, 'రాజా! ఈ పాయసాన్ని నీ భార్యలకు ఇయ్యి. వారు గర్భవతులై పుత్రులను కంటారు' అని చెప్పి, ఒక పాత్రను దశరథుని కిచ్చి, అంతర్థానమయ్యాడు. రాజు ఆ పాయసాన్ని రెండు భాగాలు చేసి, సగం కౌసల్యాదేవికి ఇచ్చి సగం కైకేయికిచ్చి ఊరుకున్నాడు. సుమిత్రకేమీ ఇవ్వలేనేదు. ఐతేం? కౌసల్య తన సగంలో సగం తీసి సుమిత్ర కిచ్చింది. కైక కూడా అలాగే చేసింది. ఈ విధంగా ఆమెకే ఎక్కువ ముట్టింది అఖరికి. సుమిత్రకు రెండు వాటాలు ముట్టడం చేత ఇద్దరు కొడుకులు పుట్టారు. కౌసల్యకీ, కైకకీ ఒక్కొక్కడే పుట్టాడు."



ఈ కథ విన్న ధనాలుకి, విశేషం ఒకటి తోచింది. దశరథుడికి సుమిత్ర పైన ఎక్కువ ఇష్టం! కనుక అటు పట్టమహిషి అయిన కౌసల్య పైనా, ఇటు ముద్దుల రాణీ అయిన కైకేయి పైనా ప్రేమ నటించి, చివరికి సుమిత్రకు రెండు వాటా లొచ్చేటట్లు పన్నాగం పన్నేడు! గడుసుతనం అంటే అలా ఉండాలి?—ఇదీ ఆమెకు తోచిన విశేషం. తను కూడా దశరథునికి మల్లేనే గడుసుతనం చూపి, కోడళ్ల పైన కూతురి మీదకంటే ఎక్కువ ప్రేమ నటించాలనుకుంది.

ఆ రోజున, పురాణం అయాక ప్రసాదం క్రింద అందరికీ తలకొక బత్తాయిపండూ

ఇచ్చారు. కామయ్య రోజుకుమల్లేనే తన వంతు ప్రసాదం భార్య చేతిలో పెట్టేడు.

ధనాలు ఇంటికి వెళ్ళటంతోనే రోజూ మల్లే ఆ పళ్ళను కాసులమ్మ చేతిలో పడెయ్యలేదు. పెద్దకోడలైన బంగారమ్మని పిలిచి ఒక పండూ, రెండో కోడలు వరహాలమ్మని పిలిచి రెండో పండూ ఇచ్చింది.

ఇద్దరు కోడళ్ళూ కూడా ఆశ్చర్య పోయారు. "రోజూ కాసులమ్మకి ఇచ్చేవారు, ఇవాళ మాకు ఇచ్చారేమిటి?" అని స్పష్టంగా అడిగేశారు కూడాను.

అందుకు అత్తగారు, "ఇదివరకు తెచ్చిన ప్రసాదం ఎప్పుడూ రవంతే ఉండేది. అది మీకిస్తే చెయ్యంటూ, నోరంటూ కావటం తప్ప కొండనాలిక కయినా కబురందదని చెప్పేసి కుర్రదాని చేతిలో పడేసేదాన్ని. ఇవ్వాళ చెరివక పండూ వచ్చింది, కనక మీ కిచ్చాను," అంది.

"సరేకాని, ఆడబడుచుకు లేకుండా మాకా?" అన్నారు కోడళ్లిద్దరూ.

"ఆడబడుచుకు వేరే వాటా యేమిటర్రా? మీరిద్దరూ చెరో చెక్కా ఇచ్చినా చాలు!" అంది అత్తగారు తడుముకోకుండా.

"ఔనత్తా, ఆ మాత్రం తోచిందే కాదు మాకు," అంటూ బంగారమ్మా, వరహాలమ్మా బత్తాయిపండు చెరో చెక్కా తీసి కాసులమ్మకు ఇచ్చారు.

ధనాలు కోడళ్ళ చేతిలో తలకొక పండూ పెడుతూ ఉండగా చూచిన కామయ్యా, అతని ఇద్దరు కొడుకులూ కూడా ఆమె ఉదారబుద్ధికి సంతోషించి చక్కాపోయారేగాని, తరవాత యేం జరిగిందీ వాళ్ళకి తెలియనే తెలియదు.

ధనాలు మట్టుకి తన పన్నాగం సరిగా పారినందుకు తన్నుతానే మెచ్చుకుంది. "పురాణం వినటంవల్లనే కదా నాకీ ఉపాయం తోచింది! పెద్దలు ఊరికే చెప్పారా పురాణాలు వినమని? ఇలాంటి లాభం కలుగుతుందనే వినమన్నారు," అనుకుని, సంతోషించింది.





# తెలివిగల ఇల్లాలు

భర్త శేషగిరి కచేరీకి వెళ్ళిపోగానే, శ్యామల కొత్తగా దిగిన అద్దె ఇంటి వాటాలో సామానులు సర్దసాగింది.

ఆ సమయంలో మధ్య తలుపు కిర్రు మని తెరిచి, ఒక స్థూలకాయురాలు లోపలికి వస్తూనే, ''ఏం కోడలు పిల్లా! కొత్త ఇల్లు నచ్చినట్టేనా? అలా ఆశ్చర్య పోకు, నన్ను దుర్గమ్మ అంటారు. పదే ళ్ళుగా పక్కవాటాలో వుంటున్నాం,'' అంటూ తనను తాను పరిచయం చేసు కున్నది.

శ్యామల తన కుటుంబాన్ని గురించి దుర్గమ్మకు చెప్పింది.

''ఇంకా పిల్లా జెల్లా కలగలేదన్న మాట! వంట ఎప్పుడు చేస్తావు? సరే, నువ్వు సామాన్లు సర్దుకుంటూవుండు, వంట పని నేను చూస్తాను,'' అన్నది ఆదరంగా దుర్గమ్మ.

ఆ మాటలకు శ్యామల ప్రాణం లేచి వచ్చినట్టయింది. ఆమె దుర్గమ్మకు వంట గది చూపించింది.

దుర్గమ్మ వంటగదిలోకి పోతూ, ''రెండు వంటలు చేయడం ఎందుకు? ఈ పూటకు మీ మామగారికూ్కడా యిక్కడే వండేస్తాను,'' అన్నది.

''అలాగే చెయ్యండి,'' అన్నది శ్యామల.

శ్యామల భర్త శేషగిరి కచేరీ నుంచి తిరిగి వచ్చే లోపల దుర్గమ్మ వంటపని పూర్తిచేసి, తమకోసం అన్నం, కూరలూ గిన్నెల్లో సర్దుకుని వెళ్ళిపోయింది. కొద్దిసేపు తరవాత శేషగిరి వచ్చాడు. దుర్గమ్మ వంట ఆ భార్యాభర్తలకు ఎంతో బావున్నది. అనుకోకుండా అలాంటి పొరుగు దొరికినందుకు యిద్దరూ పొంగి పోయారు.

మాచిరాజు కామేశ్వరరావు



అన్ని డబ్బాల మూతలూ తెరిచి చూసింది. అన్నీ సగానికి సగం తరిగివున్నవి.

"ఈ దుర్గమ్మ దేవాంతకురాలన్న మాట! ఆవిడ ఆట కట్టించడం ఎలాగో నాకు తెలుసు," అనుకున్నది శ్యామల.

శేషగిరి బయిటికి వెళ్ళిపోగానే దుర్గమ్మ తలుపుకొట్టి, యీ వైపునుంచి గది తీయించి, లోపలికి వస్తూనే, "కొత్త ఇంట నిద్ర బాగా పట్టిందా?" అంటూ అద్దం దగ్గిరకు పోయి, అక్కడ వున్న కొబ్బరినూనె తలకు యింత రాసుకుని, "మళ్ళీ పొయ్యి అంటించాలంటే బద్ధకంగా వున్నది. మీ పొయ్యి మీద కాసిని వేడినీళ్ళు పెట్టు. యిక్కడే స్నానం చేసి పోతాను," అన్నది.

శ్యామల మారుమాట్టాడకుండా నీళ్ళు కాచి, నీళ్ళగదిలో పెట్టి, అక్కడ వున్న సున్నిపిండిలో యింత కారం, ఉప్పు కలిపి బయిటికి వచ్చింది.

ఆ పిండి రాసుకుని స్నానం చేసిన దుర్గమ్మకు, ఒళ్ళంతా భగ్గుమన్నది. ఆమె బాధతో మూలుగుతూ గదినుంచి బయిటికి వచ్చింది.

శ్యామల ఎంతో అమాయకంగా ముఖం పెట్టి, "కొందరి శరీరాలకు, నేను ప్రత్యేకంగా తయారుచేసే సున్నిపిండి పడదు; దురదలూ, మంటలూను!" అన్నది.

మర్నాడు శ్యామల పొరుగింట్లో పని చేస్తున్న పనిమనిషిని, "మా ఇంట్లో కూడా పని చేస్తావా?" అని అడిగింది.

"చెయ్యను!" అన్నది పనిమనిషి పుల్లవిరుపుగా.

శ్యామల ఆశ్చర్యపోతూ, "అదేం?" అన్నది.

"ఈ వాటాలో దిగినవాళ్ళెవరూ, పట్టుమని పది రోజులు కూడా వుండరు, పనికి కుదరడం దండగ! కాస్త ఓపిక పడితే, ఆ దొంగ దుర్గమ్మ సంగతి మీకే తెలుస్తుంది," అన్నది పనిమనిషి.

ఆ మాటలు నమ్మడమా లేదా అనుకుంటూ శ్యామల వంటగదిలోకి పోయి,

ఆ ఇంట స్నానం చేస్తానన్నందుకు దుర్గమ్మ పశ్చాత్తాపపడి, వెళ్ళేముందు, "ఈ పూట కూర వండడం మరిచాను. ఒక గిన్నెలో కొంచెం కూర సర్ది యివ్వు." అన్నది.

"మా వంటలు అదో రకం - మీకు బావుంటవో లేదో!" అన్నది శ్యామల.

"అదేమిటి, కోడలుపిల్లా! తినడానికి పనికిరాకుండా ఎవరూ వండుకోరుగదా." అంటూ దుర్గమ్మ నవ్వేసింది.

శ్యామల వంటగదిలోకి పోయి, తాళింపు కూరలో కొద్దిగా ఆముదం వేసి, గిన్నెలో పెట్టి దుర్గమ్మ కిచ్చింది.

మర్నాడు దుర్గమ్మ ఇంట్లోకి వస్తూనే శ్యామలతో, "నీ వంటకో నమస్కారం. ఆ కూర యిప్పటికీ నాకు అరగనేలేదు." అన్నది.

తరవాత ఆమె సాయంత్రం భర్త ఎవరో స్నేహితుణ్ణి ఇంటికి తీసుకువస్తున్నాడని చెప్పి, శ్యామల వాళ్ళ నడవాలో వున్న మడతకుర్చీని తన వాటాలోకి ఈడ్చుకుపోయింది. నాలుగు రోజులు గడిచినా దుర్గమ్మ కుర్చీని శ్యామలకు తెచ్చి యివ్వలేదు.

శ్యామల చీకటిపడేవేళ దుర్గమ్మను, "మా మడతకుర్చీ చప్పుళ్ళకు నీకూ, మామయ్యకూ రాత్రివేళ సరిగా నిద్ర పట్టుతున్నదా?" అని అడిగింది.

"మడతకుర్చీ చప్పుడు చేయడం ఏమిటి?" అన్నది దుర్గమ్మ ఆశ్చర్యంగా.





"అయితే, మీరు గమనించలేదన్న మాట! బతికున్న రోజుల్లో, మా మామగారు ఎప్పుడూ ఆ కుర్చీనే అంటిపెట్టుకుని వుండేవారు. పోయాక కూడా ఆయనకు దాని మీద ఆశ తీరలేదు. రాత్రి వేళల్లో ఆ కుర్చీ ఊగుతూండడం చాలాసార్లు చూశాను," అన్నది శ్యామల.

దుర్గమ్మ చిన్నగా మూలిగి, కుర్చీని అప్పటికప్పుడే మోసుకువచ్చి శ్యామలా వాళ్ళ నడవాలో పడవేసింది.

ఆ రాత్రి శ్యామల భర్తకు దుర్గమ్మ గొడవలన్నీ చెప్పింది. శేషగిరి అంతా విని, "నువ్వు ఆవిడ ఎత్తుకు పై ఎత్తు వేయడం తప్ప, బాగా బుద్ధి వచ్చేట్టు గుణపాఠం నేర్పలేకపోతున్నావు." అన్నాడు.

"సరే, ఆ పని రేపే చేస్తానుండండి." అన్నది శ్యామల.

ఆ పగలు ఆమె దుర్గమ్మతో, "చూడండి, అత్తయ్యా, మీ అబ్బాయికి బొత్తిగా భయంలేదు. పెట్టెలో నావి బోలెడు నగలున్నాయికదా, వాటికి తోడు తన చెల్లెలు నగలు కూడా తెచ్చిపెట్టాడు. వాటిని కరిగించి, ఏదో కొత్త రకంగా నగలు చేయించమన్నదట. అసలే రోజులు బాగాలేవు, ఎక్కడ చూసినా దొంగతనాలు!" అన్నది.

"అవును, కోడలా, బాగా గుర్తు చేశావు! ఈ రాత్రికి మీ మామయ్య ఎవరో స్నేహితుడి ఇంట్లో కాలక్షేపం చేయబోతున్నాడు. ఒంటరితనం అంటే నాకు భయం. మధ్య వాటా తలుపు కాస్త తెరిచివుంచు. రాత్రికి అక్కడే చాప పరుచుకుని నిద్రపోతాను," అన్నది దుర్గమ్మ.

శ్యామల అందుకు సరేనన్నది. దుర్గమ్మ తన భర్త ద్వారా, లేని నగల దొంగతనానికి ప్రయత్నించగలదని ఆమె అనుమానించింది. ఆమె భర్త శేషగిరికి సంగతి చెప్పి, రాత్రికి కొంచెం మెలకువగా వుండమన్నది.

ఆ రాత్రి బాగా పొద్దుపోయాక, నిద్ర నటిస్తున్న శ్యామలా, శేషగిరులకు కాస్త విలువైన వస్తువులుండే నడవా గదిలోకి ఒక నల్లని ఆకారం ప్రవేశించడం కంట బడింది. అది దుర్గమ్మ భర్త అని వాళ్ళు గుర్తించారు. శ్యామల పిల్లిలా నడుస్తూ పోయి గది తలుపుకు బయిటినుంచి గొళ్ళెం పెట్టింది.

తరవాత ఆమె దుర్గమ్మ దగ్గిరకు పోయి, ''అత్తయ్యా, లే! ఎవడో దొంగ పీనుగ నడవా గదిలోకి దూరాడు. బయట గొళ్ళెం పెట్టేశాను. కాస్త కేక వేసి, ఇరుగు పొరుగు పదిమందినీ పిలువు,'' అన్నది.

దుర్గమ్మకు పై ప్రాణాలు పైనే పోయి నట్టయింది. ఆమె తనకూ, భర్తకూ పదిమందిలో జరగనున్న పరాభవం ఊహించుకుని వణికిపోతూ, శ్యామలా, శేషగిరుల చేతులు పట్టుకుని, ''నన్ను క్షమించండి! ఆ గదిలో వున్నది, నా భర్తే. నేనే, ఆయన్ను దొంగతనానికి పురమాయించాను. నలుగుర్నీ పిలిచి మమ్మల్ని అవమానాలపాలు చేయకండి,'' అన్నది.

శ్యామలా, ఆమె భర్తా దుర్గమ్మను తల వాచేలా చీవాట్లు పెట్టి, గది తలుపు తెరిచి దుర్గమ్మ భర్తను విడిచిపెట్టారు. ఇక అక్కడ వుండేందుకు మొహం చెల్లక దుర్గమ్మా, భర్తా తెల్లవారి అంత పొద్దెక్కే లోపల తమ వాటా ఖాళీచేసి ఎటో వెళ్ళి పోయారు.

ఆ తరవాత కొద్దిసేపటికల్లా, పక్క ఇళ్ళల్లో పనిచేసే పనిమనిషి శ్యామల దగ్గిరకు వచ్చి, ''అమ్మగారూ, ఆ మధ్య మీ ఇంట్లో పని చెయ్యమన్నారుగదా, చేస్తాను. ఈ వాటాలో చేరినవాళ్ళందరూ దుర్గమ్మ దొంగ బుద్ధికి భయపడి పారి పోయారు. మీరు మాత్రం దుర్గమ్మ చేతనే వాటా ఖాళీ చేయించారు. ఏమిటీ వింత!'' అన్నది.

''ఇందులో వింత ఏమీ లేదు. మా ఆవిడ చాలా తెలివిగల ఇల్లాలు!'' అంటూ శేషగిరి చిన్నగా నవ్వాడు.





# రాజద్రోహి

విశాలదేశాన్ని విజయేంద్రుడనే రాజు పాలిస్తుండేవాడు. ఆ దేశంలో ఏవైనా కొత్త భవనాలు కడుతున్నప్పుడూ, చెరువులు గాని, వ్యవసాయ అవసరాలకు కొత్తకాలవలు గాని తవ్వుతున్నప్పుడూ, అనేక పురాతన శాసనాలు బయటపడుతూండేవి. అవి, వివిధ కాలాలకు సంబంధించిన శాసనాలు కావడంతో, రకరకాల భాషలలో వుండేవి.

ఆ శాసనాలను విశాలదేశ భాషలోకి తర్జుమా చేయడానికి, విజయేంద్రుడి కొలువులో, ఆయా భాషలు నేర్చిన పండితులు కొందరుండేవారు. ఆ శాసనాలవల్ల రాజు ఆ కాలంనాటి పరిపాలనకు సంబంధించిన అనేక కొత్త విషయాలు తెలుసుకునేవాడు. కొన్ని శాసనాల ఆధారంతో, ఎక్కడో దాచిన రహస్య నిధులు కూడా వెల్లడవుతూండేవి.

ఒకసారి విశాలదేశ రాజధాని కమలపురిలో కొత్తగా రామాలయాన్ని కట్టేందుకు పునాదులు తవ్వుతూండగా, సింధూరదేశ భాషలో కొన్ని పురాతన శాసనాలు బయటపడినై. మంత్రి వాటిని రాజుకు చూపించాడు.

రాజు విజయేంద్రుడు వాటిని పరీక్షించి, "ఇది సింధూర దేశభాష అనే దాంట్లో సందేహించవలసిందేమీలేదు. నేను గురుకులంలో విద్యాభ్యాసం చేసే రోజుల్లో, ఆ దేశ సామంతుడి కుమారుడొకడు, నాకు సహాధ్యాయిగా వుండేవాడు. కాని, దీన్ని తర్జుమా చెయ్యగల పండితుడు మన ఆస్థానంలో వున్నట్టులేదే!" అన్నాడు.

"లేకేం, మహారాజా! పారసీక, సింహళ భాషలు తర్జుమాచేసే భూషణపండితుడు, సింధూరదేశభాషను కూడా తర్జుమా చెయ్యగలడు," అన్నాడు మంత్రి.

రాంబాబు



"భూషణుడికి సింధూర దేశభాష వచ్చునని, యీనాటి వరకూ నాకు తెలియదు," అన్నాడు రాజు.

"నాకు యీ విషయం యింతకు ముందే తెలిసింది, మహారాజా. ఈ శాసనాలు తీసుకుని తమ దర్శనానికి వస్తుండగా, భూషణపండితుడు దారిలో తటస్థపడి, తనకు సింధూర దేశభాష కూడా తెలుసునని చెప్పాడు," అన్నాడు మంత్రి.

"అలాగా! మన ఆస్థాన పండితులను గురించి కొన్ని ఫిర్యాదులు వస్తున్నవని మీకు లోగడ చెప్పాను. వాళ్ళు తమ విద్యనూ, పలుకుబడినీ స్వార్థానికి ఉపయోగించుకుంటున్నారట. ఇందులో వున్న నిజా నిజాలను గురించి తెలుసుకునేందుకు, మీరేమైనా ప్రయత్నించారా?" అని అడిగాడు రాజు విజయేంద్రుడు.

మంత్రి మందహాసం చేసి, "ఇవన్నీ గిట్టని ఎవరో పామరులు మన పండితులపై ఈర్ష్యకొద్దీ చేసే ఫిర్యాదులు. అంతకన్న మరేమై వుండదు, మహారాజా!" అన్నాడు.

"సరే, భూషణపండితుణ్ణి ఒక వారం గడిచాక వచ్చి నన్ను కలవమనండి," అన్నాడు రాజు.

వారం గడవగానే భూషణ పండితుడు రాజును చూడవచ్చాడు. రాజు అతడికి ఏవో పాత రాగిరేకులు యిస్తూ, "నిన్న మన రాజభవనం ఆవరణలో మొక్కలు నాటుతున్న తోటమాలికి యివి దొరికనై. ఇది కూడా సింధూరదేశ లిపిలా కనిపిస్తున్నది. ఇందులో వున్న దేమిటో చెప్పండి," అన్నాడు.

భూషణుడు రాగిరేకుల మీద వున్నది చదివి, "మహారాజా, ఎవరో భూస్వామి తన తదనంతరం ఆస్థిని కొడుకులు ఎలా పంచుకోవాలో, వీటిలో వున్నది," అన్నాడు.

"అంతేనా! ఇక మీరు వెళ్ళవచ్చు. అవసరపడితే మళ్ళీ కబురుచేస్తాను," అన్నాడు రాజు.

భూషణ పండితుడు వెళ్ళిపోయాక, ఆయన మంత్రిని పిలిపించి, "మన నగరానికి దక్షిణాన వున్న శ్మశానంలో ఒక పెద్ద ఊడలమర్రి వున్నది. అక్కడికి మన భటులను వెంటనే పంపండి. అటుగా భూషణ పండితుడు గనక రావడం జరిగితే, అతణ్ణి బంధించమనండి," అని చెప్పాడు.

మంత్రి గుణసేనుడికి కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. అది గమనించిన రాజు, అతడితో, "ముందు నే చెప్పినట్టు చెయ్యండి. ఆ తరవాత మీకే, పండితుల ఫిర్యాదులకున్న విలువ, పామరుల ఫిర్యాదుల కూ్కడా వుంటుందని తెలుస్తుంది!" అన్నాడు.

ఆ సాయంత్రమే భటులు బంధించిన భూషణ పండితుణ్ణి వెంటబెట్టుకుని మంత్రి రాజు దగ్గిరకు వచ్చి, "మహారాజా, ఈ భూషణుడు ఊడలమర్రి దగ్గిర పలుగు, పారలతో వచ్చి మన భటులకు దొరికాడు," అన్నాడు.

రాజు, భటులకు భూషణుణ్ణి ఖైదులో పెట్టమని చెప్పి, మంత్రితో, "భూషణుడు దొరికిన కొన్ని శాసనాల్లోని అసలు విషయం దాచి, అనేక రకాలుగా ధనసంపాదన చేస్తున్నట్టు కొందరు నాకు చెప్పారు. నాలుగు రోజుల క్రితం సింధూరదేశం వాడైన నా గురుకుల సహాధ్యాయి వచ్చాడు. అతడిచేత కొన్ని రాగిరేకుల మీద శ్మశానంలోని ఊడలమర్రి దగ్గిర లక్ష వరహాల నిధి వున్నట్టు రాయించాను. వాటిని తోటమాలికి దొరికినవని చెప్పి, భూషణుడికి చూపించాను. అతడు అవేవో ఒక భూస్వామి ఆస్తికి సంబంధించిన వివరాలంటూ నాకు అబద్ధం చెప్పాడు. తరవాత లేని నిధి తవ్వి తెచ్చుకునేందుకు వెళ్ళి, మన భటులకు దొరికాడు," అన్నాడు.

మంత్రి, "మహారాజా, ఇది ఒక రకంగా నాకే కాక, మన కొలువులోని పండితులందరికీ కూడా మంచి గుణపాఠం. భూషణుడి రాజద్రోహానికి యావజ్జీవ కారాగారమే తగిన శిక్ష!" అన్నాడు.





# విఘ్నేశ్వరుడు

హోమాగ్నినుండి పుట్టిన భయంకరమైన జంతువు అదృశ్యం కాగానే కాలుడు విఘ్నాసుర రూపం దాల్చి కాలపాశాన్ని విశిరాడు. కాలపాశం గిరగిరా తిరుగుతూ ప్రళయంగా అంతా చుట్టబెట్టింది. అభినందనుడు పరాక్రమించి దాన్ని ఛేదించడానికి యత్నించి నేలకొరిగాడు. కాలపాశం మరింత విజృంభించి జీవకోటిని అంతమొందిస్తూంటే వశిష్ఠుడు మొదలైన సప్తమహర్షులు, ఋషులు, లోకకళ్యాణం కోరేవారంతా కలిసి బ్రహ్మను ప్రార్థించారు.

బ్రహ్మ, "కాలపాశాన్ని తప్పించడం ఎవరితరమూ కాదు. కాలప్రభావాన్ని అరికట్టి కాలుణ్ణి నిగ్రహించగలవాడు గణేశుడొక్కడే!" అని చెప్పి వారందరితో కలిసి గణేశ్వరుడిని ప్రార్థించాడు.

మహాగణాధిపతి స్వస్తికాపీఠంపై ఆసీనుడై సాక్షాత్కరించాడు. తన చేతనున్న పాశాన్ని వదిలాడు. గణేశుని పాశం కాలపాశాన్ని ఉచ్చుపన్ని పట్టినట్లు గణాధిపతి ముందు కట్టి పడేసింది.

కాలుడు పరాభవంతో మండిపడుతూ మరింత భీకరజుగుప్సాకరంగా విఘ్నాసుర రూపం చూపుతూ కాలదండాన్ని ఎత్తి ఝుళిపించాడు. గణేశుడు అంకుశాన్ని వదిలాడు. అంకుశం విఘ్నాసురుడి వెన్నెముకలో గుచ్చింది.

విఘ్నాసురుడు అంకుశం తాకిడితో అలా అలా కుదించుకుపోయి, అంకుశం



వెన్నంటి తరుముతూండగా శరణు కోరుతున్నట్లుగా గణేశుడి రెండు పాదాల ఇరుకున పడి బందీగా చిక్కుకున్నాడు. గజముఖుడు విఘ్నాసురుణ్ణి రెండు పాదాలతో గట్టిగా నొక్కాడు.

అప్పుడు కాలుడు విఘ్నాసురుడి నుంచి బయటపడి గణేశుడికి మ్రొక్కుతూ, ''గణేశా! నీ మహావిశ్వపాశం ముందు యీ భూమికి, సూర్యోదయ సూర్యాస్తమయాలకు మాత్రమే సంబంధించిన నా కాలపాశం ఎంత! విశ్వాన్ని అదుపులో ఉంచే నీ అంకుశం ముందు నా దండ మేపాటిది! పర్వతంలాంటి భూతాన్ని నీ వాహనరూపాలైన చిట్టెలుకలు తుదముట్టించాయి! నీవు విఘ్నాసురుణ్ణి అధీనంలో పెట్టుకొన్న విఘ్నేశ్వరుడివి! దేవా, నన్ను మన్నించు!'' అని వేడుకున్నాడు.

విఘ్నేశ్వరుడు, ''కాలా! ఇతరుల పని నెత్తిని వేసుకోవడం కోరి ముప్పుతెచ్చుకోవడమే! నీ ధర్మాన్ని నువ్వు నిర్వర్తించు! ఇక యిక్కడి నుంచి కదిలి, వెళ్ళు,'' అని మందలించాడు.

కాలుడు మెలివేసిన చేతులతో చెవులు పట్టుకుని మూడుసార్లు వంగి లేచి, లెంపలు వేసుకొని, ''బుద్ధి బుద్ధి! ఆ ఇంద్రుడి మాటవిని గడ్డి కరిచాను, బుద్ధి వచ్చింది దేవా! విఘ్నేశ్వరుడవైన నిన్ను నమ్మి కొల్చినవారి దాపులకు నేను పోను. వారిని వ్యాధులు సోకవు, వారికి విఘ్నాలుండవు!'' అని చెప్పి శలవు తీసుకున్నాడు.

కాలుణ్ణి విఘ్నేశ్వరుడు భంగపుచ్చినప్పుడే కాలపాశంవల్ల నేల కొరిగిన అభినందన మహారాజు మొదలైనవారంతా సజీవులై నిద్రలేచినట్లు లేచారు. పూలజల్లు కురిసింది.

వినాయకుణ్ణి విఘ్నేశ్వరుడనీ, విఘ్నరాజు అనీ అందరూ కీర్తించారు.

అప్పట్నించీ, ఏ మంచి పనికైనా, శుభకార్యానికైనా స్వస్తికను ముగ్గుగా తీర్చి

దిద్దడం, పసుపుముద్దను విఘ్నేశ్వరుని ప్రతిరూపంగా ఉంచి పూజించడం సంప్రదాయంగా నిలిచింది.

"కాలపురుషుణ్ణి భంగపుచ్చి పాదాక్రాంతుణ్ణి చేసుకొన్న విఘ్నేశ్వరుడి మీద విశ్వాసం కలవారూ, విఘ్నేశ్వరుడి ఆశీర్వాద బలం ఉన్నవారూ కాలప్రవాహానికి ఎదురీత ఈది నిలద్రొక్కుకొని, విజయం సాధించగలరు!" అని చెప్పి పావన మిశ్రుడు ముగించాడు.



ఒకనాటి సాయంకాలం ఒక బాలిక పావనమిశ్రుడి దగ్గిరకు వచ్చి, అతడి చిటికెనవేలు పట్టుకొని ఒక కుడ్య చిత్రం దగ్గిరకు తీసుకువెళ్ళింది.

ఆ చిత్తరువులో అసమాన సౌందర్యం గల ఒక కన్య విఘ్నేశ్వర విగ్రహానికెదురుగా మోకరిల్లి నమస్కరిస్తున్నది. ముక్కుపచ్చలారని ఆమె తల ముగ్గుబుట్టలా ఉంది. పావనమిశ్రుడు ఆ కథ చెప్పడం ప్రారంభించాడు:

ఒక పుణ్య దంపతులకు విఘ్నేశ్వరుని ఆరాధించిన వరప్రసాదంగా రత్నంలాటి ఆడపిల్ల పుట్టింది. పుడుతూనే ఆ శిశువు పురిటిగదికి ఎదురుగా గూటిలో ఉన్న విఘ్నేశ్వర ప్రతిమను విప్పారిన కన్నులతో చూస్తూ, ఆ బొమ్మ పిలుస్తున్నట్లుగా క్యారుమన్నది.

ఆ పాప ఉయ్యాల తొట్టిలో ఊగుతూ గూటిలో వున్న గణేశవిగ్రహాన్ని చూసుకుంటూ నవ్వులతో కేరింతాలు కొడుతూ ఆడుకొనేది.

ఆ పిల్లకు సుందరి అని పేరు పెట్టారు. పేరుకుతగ్గట్టుగా సుందరి గొప్ప సౌందర్యవతిగా పెరిగి పెళ్ళియీడుకువచ్చింది. సుందరికి సౌందర్యంతోబాటు గొప్ప బుద్ధి, తెలివితేటలు, అందరికీ హితవుకూర్చే మాట తీరూ కలిగి ఉండటం చూసి, ఆమెను జ్ఞానసుందరి అన్నారు.

సుందరి అసమాన సౌందర్యంగురించి ఊరూరా చెప్పుకోసాగారు. శాపవశాన పుట్టిన గంధర్వకన్య అనీ, భూమ్మీద



అవతరించిన దేవసుందరి అనీ అన్నారు. ఆమె పాణిగ్రహణానికి గొప్ప ధనసంపన్నులూ, అధికార బలంగలవారూ అసంఖ్యాకులుగా సుందరి తలిదండ్రులను ఒత్తిడి చేశారు. సుందరి గురించి విన్న ఆ రాజ్యమేలే మహారాజే, ఆ కన్యకారత్నాన్ని తన రాణివాసానికి తీసుకుపోడానికి పరివారంతో రాజధాని నుండి బయలుదేరి వస్తున్నాడని తెలిసింది.

సుందరి ప్రతినిత్యమూ ఆరాధించే నదీ ఘట్టాన ఉన్న విఘ్నేశ్వర శిలావిగ్రహం ముందు మోకరిల్లి, కన్నులు మూసి నమస్కరిస్తూ, "విఘ్నేశ్వరా! శైశవం నుంచీ నిన్నే నమ్మినదాన్ని. సంసారంలో కొట్టుకుపోవడం నాకు యిష్టంలేదు. నన్ను ముసలిదాన్ని చెయ్యి! జ్ఞానసంపద నాకు అనుగ్రహించు! పుట్టినందుకు ప్రయోజనకరమైన పని నా చేత చేయించు!" అని ధ్యానిస్తున్న ఆమె నల్లని కొప్పు వెండిలాగ మెరుస్తూ నెరిసింది. పాలబుగ్గలు సొట్టలు సొట్టలుపడ్డవి. నుదురుఅడ్డంగాముడుతలు దేరింది. నదికి వచ్చినవారంతా నివ్వెరపోతూ చూస్తున్నారు. అమ్మాయి అవ్వ అయింది!

"అమ్మాయి సుందరీ! ఏమిటమ్మా ఇది?" అంటూ కంటనీరు పెట్టుకొంటున్న తండ్రి, తల్లితో, "నేను అమ్మాయినీ కాను, సుందరినీ కాను, అవ్వను! మీరు సంతోషించడానికి బదులు విచారిస్తారెందుకు? మీరిచ్చిన జన్మను సార్థకంగా చేసుకొనే అవకాశాన్ని గణేశుడు అనుగ్రహించాడు. నా కంటె అజ్ఞానులైన వారికి నాకు తెలిసిన హితవచనాలు చెప్తాను. జ్ఞానులైనవారినుండి తెలియనివి తెలుసుకుంటాను. అజ్ఞాన దశలో ఉన్న వారంతా పసిపిల్లలవంటివారే. అంతా నా పిల్లలే, వారికి నేను అవ్వను!

నా పుట్టిన రోజు యీ రోజేకద, ఇదే నా పండగరోజు! పదయాత్రకు బయలుదేరుతున్నాను, నన్ను ఆశీర్వదించండి!" అని అవ్వ అంటూ అక్కడ

పడి ఉన్న చెట్టుకొమ్మను ఊతకర్రగా పట్టుకొని లేచి నిలబడింది.

అప్పుడే అక్కడికి చేరుకున్న రాజును చూసి అవ్వ, "ప్రజల ధన ప్రాణ గౌరవాలను కన్యలను రక్షణలో ఉంచవలసిన నువ్వే, ఒక కన్యను ఎత్తుకుపోవచ్చావు. ఊళ్ళు, ఇళ్ళు దోచుకొనే దండునాయకుడివా? రాజువా?" అని అడిగింది.



సిగ్గుతో సగం చచ్చిపోయిన మహారాజు కత్తినీ, కిరీటాన్నీ తీసి దూరంగా పెట్టి, అవ్వ పాదాలకు ప్రణమిల్లి, "మహాత్మురాలా! నీ దర్శనంతో నా అజ్ఞానం తొలగింది. నేను నా రాజసాన్ని వదిలి ప్రజకు సేవకుడిననుకుంటూ వర్తిస్తాను!" అన్నాడు.

కారణజన్మురాలని అంతా అవ్వను కీర్తిస్తుండగా బయలుదేరుతున్న అవ్వను పల్లకిలో సంచారం చేయవలసిందనీ, సర్వవిధ ప్రయాణ సౌకర్యాలు అమర్చుతాననీ రాజు ప్రాథేయపడ్డాడు.

అవ్వ నిరాకరించి, "రాజా! చెప్పులకు కూడా నోచుకోని అతి సామాన్యులైన కష్టజీవుల మధ్యకు అందలమెక్కి వెళ్ళి ఏ మొగంతో నీతులు బోధించగలను? నువ్వు ప్రజకు విద్యా సౌభాగ్యాలను చేకూర్చు. నీ పని నువ్వు చెయ్యి! నేను సామాన్యురాలిగా, సామాన్యులందరితో ఒకటిగా నేను చేయగల్గినది చేసుకుపోతాను. విఘ్నేశ్వరుడు, అతని ముద్దుల తమ్ముడు సుబ్రహ్మణ్యేశ్వరుడు అన్నీ చూసుకుంటారు. వారే నాకు రక్ష!" అని చెప్పింది.

అవ్వ కర్ర ఊతగా కాలినడకను బయలుదేరి, జ్ఞానపీఠమైన ఒక మఠాన్ని చేరుకొంది. పీఠాధిపతికి మొక్కి, "అయ్యా! నాకు జ్ఞానం ఉపదేశించండి!" అని కోరింది.

పీఠాధిపతి సంశయిస్తూ, "అమ్మా! నువ్వు స్త్రీవి, జ్ఞానోపదేశం పొంది ఏం ప్రయోజనం?" అన్నాడు.

అవ్వ, "నీరూ, దీపమూ మగవాడికే గాని స్త్రీకి ఉపయోగపడవా? ఉపయో



గించలేదా? గ్రుడ్డివాడి చేతనున్న దీపం ఇతరులకు దారి చూపించగలదు కదా! జీవిలో నేను అనే జ్ఞానస్వభావం మగదా? ఆడదా? ఏదీ కానిది, అన్నీ అయినది, అన్నిటా ఉన్నది ఒకటే అని అంటూనే పుట్టుకచేత ఎక్కువతక్కువలు, అర్హతలు ఎంచడం జ్ఞానుల పనేనా?'' అని అన్నది.

పీఠాధిపతి, ''మహాత్మురాలా! జ్ఞాన పీఠంపై ఉండవలసింది నేను కాదు, నీవే!'' అని అన్నాడు.

అవ్వ, ''పీఠాలు, మఠాలు ఎందుకు? అందరికీ తేలికగా అర్థమయ్యేలాగ దగ్గిరి కెళ్ళి ఎక్కువమందికి జ్ఞానం అందించడం మంచిది కదా! పంచభక్ష్య పాయసాల రాజభోజనం ఒకడికి పెట్టే కంటే, అంతా తినేది పదిమందికీ పెడితే కాదా!'' అని అన్నది.

''ఔను! నేనూ అదే అనుసరిస్తాను,'' అని శిరసు వంచి నమస్కరించాడు పీఠాధిపతి.

అవ్వ అలా వెళ్తూండగా ఒక మంచి నీటి బావి దగ్గిర నలుగురు స్త్రీలు నీళ్ళు తోడుకొని తీసుకెళ్లే విషయంలో ఒకామె చెప్తున్నది వింటున్నారు. ఆవిడ శాసిస్తున్నట్టు, ''ఎవరు ముందు వచ్చినా, వెనక వచ్చినా నేను ముందు తోడుకెళ్ళాలి. తర్వాత ఈవిడగారు, తర్వాత ఆమె, ఆ తర్వాత ఆ మనిషి!'' అని అంటున్నది.

దూరంగా ఒక బాలిక, ''కాసిని నీళ్ళు పొయ్యండమ్మా, గొంతారిపోతున్నది!'' అంటూ దీనంగా అరుస్తున్నది.

నలుగురు స్త్రీలు ఏకకంఠంతో, ''దూరం, దూరంగా పోవే! యీ చాయలకు రాకు!'' అంటూ కసిరినట్టు అరుస్తూండగా, చాలాదూరం ఎండలో నడిచి వచ్చిన బాలిక శోషిల్లుతూ పడిపోయింది.

అప్పుడు అవ్వ వెళ్ళి తన జారీ చెంబుతో బాలిక నోట్లో నీళ్ళు పోసి తాగించింది. మిగిలిన నీరు అవ్వ తాగి దాహం తీర్చుకుంది. అది చూచి నలుగురు స్త్రీలూ నోళ్ళు నొక్కుకుంటూ, ''హవ్వ!

ఎంత పనిచేశావు, అవ్వా! అది తాగగా మిగిలిన నీరు నువ్వు తాగుతావా! అది జాతి తక్కువది!'' అన్నారు.

అవ్వ త్రేన్చి శాంతంగా, ''శ్రీమతుల్లారా! అసలు జాతే లేనిదాన్ని నేను! అయితే ఆ పిల్లలో, నాలో నీళ్ళే నాళాల్లో ప్రవహిస్తూన్నందువల్ల నీళ్ళే మమ్మల్ని సేద దేర్చాయి!'' అంటూ కుతూహలంగా వెళ్ళి వాళ్ళ కడవ, బిందెల్లోకి చూసి ఆశ్చర్యంతో, ''మీ శరీరం నిండా పాలే ఉంటాయనుకుంటున్నాను, మీకు నీళ్ళెందుకు? త్రాగడానికి కాదు గదా? అమ్మల్లారా! నీళ్ళు మాకు వదలండి, మీరు పాలే త్రాగండి!'' అని అంటూ తన చెంబు నిండా నీళ్ళు పోయించుకున్నది.

నలుగురు స్త్రీలూ అవ్వ మాటల్లో దాగి ఉన్న సత్యాన్ని గ్రహించి బుద్ధి తెచ్చుకున్నారు.

అవ్వ అలా వెళ్తూండగా ఒక ఊళ్ళో జీవాల బలులు సాగుతున్నవి. జనం భయపడుతున్నట్లుగా దేవతకు మ్రొక్కుతున్నారు.

అవ్వ, ''ఎంత అన్యాయం చేస్తున్నారే, తల్లీ! వాళ్ళేమో మాంసాన్ని మంచి రుచులతో వంట చేసుకొని తింటారు, నిన్ను పచ్చి నెత్తురు తిని బతికే క్రూర జంతువుగా అవమానిస్తున్నారు. తల్లిని అవమానించే పిల్లలైపోయారు వీళ్ళంతా!'' అని అంటున్న మాటలు జనం విని, ''అపచారం! అపరాధం! అమ్మ తల్లికి ఆగ్రహం వస్తే అంతా మసి చేస్తుంది!'' అంటూంటే, అవ్వ, ''లంచం పెట్టలేదని ఏ తల్లైనా పిల్లల్ని చంపుతుందా? మీరు ఊరికే భయపడుతున్నారు, అంతే! భయాన్నే భక్తి అనుకుంటున్నారు! మీ కోరికల్ని అమ్మకు అంటగట్టుతున్నారు! నిజమైన భక్తి అమ్మ మీద మీకు కలిగిన నాడు మీకు భయమూ ఉండదు, ఆపదలూ ఉండవు!'' అని చెపుతూ వారికి అర్థమయ్యేలాగ భక్తి మార్గాన్ని ఉపదేశించింది.





# నేర్పరులైన దొంగలు

పూర్వం అరేబియాలోని ఒక నగరంలో ఇద్దరు దొంగలుండేవారు. వారిలో ఒకడు పగటి దొంగ; వాడు జేబులు దోచి డబ్బు గడించేవాడు. రెండవవాడు రాత్రి దొంగ; కన్నాలు వేసి దొంగతనాలు చేయటం ద్వారా ధనం సంపాయించేవాడు.

ఈ దొంగలిద్దరూ తమకు తగిన అంద గత్తె నొకతెను చూసి పెళ్ళాడగోరారు. ఇద్దరూ ఒకతెనే ప్రేమించటంచేత ఆ పిల్ల వారిలో ఎవణ్ణి చేసుకోవాలో తేల్చుకోలేక పోయింది. నన్ను చేసుకోమంటే నన్ను చేసుకోమని వారు పీడించటం చేత ఆమె వారిద్దరితోనూ ఈ విధంగా చెప్పింది: "మీరిద్దరూ దొంగతనాలు చేసి బతికే వాళ్లే. ఇద్దరూ నన్ను పోషించగలవాళ్ళే. కాని మీ ఇద్దరిలో ఎవరు ఎక్కువ నేర్పరి అయితే వాణ్ణి చేసుకోవాలని నా కున్నది. అందుచేత మీ ఇద్దరూ కూడబలుక్కుని ఒక నిర్ణయానికి వస్తే, నేను మీలో నేర్పరిని పెళ్ళాడగలను," అన్నదామె.

దొంగలిద్దరూ ఆమె చెప్పిన దానికి సరే నని ఒకరి నేర్పరితనం ఒకరికి చూపించటానికి నిశ్చయించుకున్నారు.

"ముందు నా నేర్పరితనం నీకు చూపుతాను. తరవాత నీ నేర్పరితనం నాకు చూపుదువుగాని. ఆ తరవాత మన ఇద్దరిలో ఎవరు గొప్ప అయినదీ తేల్చుకుందాం!" అన్నాడు పగటిదొంగ, కన్నపు దొంగతో.

కన్నపుదొంగ ఇందుకు ఒప్పుకున్నాడు. ఇద్దరూ కలిసి షరాబు వీధికి వెళ్లారు. అక్కడ ఒక వడ్డీ వ్యాపారస్తుడు, తనకు రావలసిన బాకీ వసూలు చేస్తూ వీధి వెంట వెళ్ళటం వారి కంట పడింది.

"ఆ వడ్డీవ్యాపారిని చూడు. వాడి జేబులో ఉండే సంచీలో చాలా సొమ్ముం



టుంది, దాన్ని కాజేసుకు వస్తాను, చూసుకో!'' అన్నాడు పగటిదొంగ.

ఈ మాటలు విని కన్నపుదొంగ ఆశ్చర్య పడ్డాడు. పగటి దొంగ వడ్డీ వ్యాపారి వెనకే నాలుగడుగులు నడిచి సునాయాసంగా ఆయన జేబులో ఉండే మొహరీల సంచీ లాగేసి తన స్నేహితుడి వద్దకు తిరిగి వచ్చాడు.

''నువు నిజంగా ఆరితేరిన వాడివే సుమా!'' అన్నాడు కన్నపు దొంగ.

''నా తెలివి ఈ సంచీని కాజెయ్యటంలో లేదు. ఇది నాదేనని న్యాయాధికారి చేతనే అనిపిస్తాను, చూస్తూ ఉండు. అలా చేయని పక్షంలో రక్షకభటులు నా దగ్గిర ఈ సొమ్ము పట్టుకుని దొంగసొమ్మని సులువుగా రుజువు చేస్తారు. అందుచేత, ఈ సొమ్ము నా దేనని ముందే రుజువుచేసేస్తాను!" అన్నాడు పగటిదొంగ.

''అది సాధ్యమేనా?'' అన్నాడు కన్నపు దొంగ.

''నువే చూస్తావుగా!'' అంటూ జేబు దొంగ తన స్నేహితుణ్ణి ఒక సందులోకి తీసుకుపోయి, అక్కడ సంచీ విప్పి అందులో ఉన్న మొహరీలు లెక్కించాడు. సరిగా అయిదు వందల మొహరీలు ఉన్నాయి. వాటిలో నుంచి పది తీసి తన జేబులో వేసుకుని, తనవద్ద ఉన్న రాగి ముద్రిక ఒకటి సంచీలో వేసి, జేబు దొంగ సంచీని యథాప్రకారం కట్టేశాడు.

తరవాత అతను మళ్ళీ షరాబు వీధిలోకి వచ్చి, వడ్డీ వ్యాపారి వెనకగా కొంత దూరం వెళ్ళి ఆ సంచీని తిరిగి ఉపాయంగా ఆయన జేబులో వేసేశాడు.

ఈపాటికి వడ్డీవ్యాపారి తన దుకాణం దగ్గిరికి వచ్చి లోపలకు పోబోతున్నాడు. ఇంతలో జేబుదొంగ గట్టిగా గొంతెత్తి, ''దొంగ! దొంగ! పట్టుకోండి!'' అని అరుస్తూ వడ్డీ వ్యాపారిపైబడి అతణ్ణి నాలుగు గుద్దులు గుద్దాడు.

అందరూ పోగయారు. జేబుదొంగ వారితో, ''వీడు దొంగముండాకొడుకు!

చూడండి, పైకి ఎలాటి పెద్దమనిషిలాగా ఉన్నాడో. నా మొహరీల సంచీ కాజేసి పోతున్నాడు!'' అన్నాడు.

వడ్డీవ్యాపారిని చూస్తే అందరికీ మంటే. ''న్యాయస్థానానికి ఈడ్చుకు పొండి!'' అని అందరూ సలహా ఇచ్చారు. జేబు దొంగ వడ్డీ వ్యాపారిని రెక్క పట్టుకుని న్యాయస్థానానికి లాక్కుపోయి న్యాయాధికారితో, ''అయ్యా, ఈ ముసలివాడు నా మొహరీల సంచీ కాజేశాడు. తమరు నాకు న్యాయం చేయించాలి!'' అని విన్నవించుకున్నాడు.



''దొంగిలించిన సంచీ ఏదీ?'' అని అడిగాడు న్యాయాధికారి.

వడ్డీవ్యాపారి జేబులు పరికిస్తే సంచీ ఉన్నది. వడ్డీవ్యాపారి కంగారుతో, ''అయ్యా, ఇది నా సంచీయే! నేను బాకీలు వసూలు చేసుకుంటుండగా ఈ మనిషి నాకు దొంగతనం అంటగట్టాడు. కాని నేనీ మనిషిని ఎన్నడూ చూసీ కూడా ఎరగను,'' అన్నాడు.

''అది నీ సంచీయే అయితే అందులో ఏమేమి ఉన్నదీ చెప్పు,'' అన్నాడు న్యాయాధికారి.

''అందులో అయిదువందల మొహరీలున్నాయి, అంతే!'' అన్నాడు వడ్డీ వ్యాపారి నిబ్బరంగా.

''అది అబద్ధం! అందులో నాలుగు వందల తొంభై బంగారు మొహరీలూ, నా రాగి ముద్రికా ఉన్నాయి. ఈ దొంగవాడు తమ ముందు అబద్ధమాడుతున్నాడు!'' అన్నాడు జేబుదొంగ.

సంచీ విప్పి చూస్తే అందులో నాలుగు వందల తొంభై మొహరీలూ, ముద్రికా ఉన్నాయి.

న్యాయాధికారి ఆ సంచీని జేబు దొంగ కిప్పించి, వడ్డీ వ్యాపారికి నూరు కొరడా దెబ్బలు శిక్ష విధించాడు.

సంచీ తీసుకుని కన్నపుదొంగ వెంట తిరిగి వచ్చేస్తూ జేబుదొంగ, ''ఎలా ఉంది, నా నేర్పు?'' అన్నాడు.



''జేబు దొంగతనాలలో నీ నేర్పరితనం అసాధారణమైనదే. కాని చీకటి దొంగతనాలలో నా నేర్పరితనం కూడా ఈ రాత్రికి చూపిస్తాను. అప్పుడు మనలో ఎవరు గొప్పో తేల్చుకుందాం!'' అన్నాడు కన్నపు దొంగ.

ఆ రాత్రి జాము పొద్దుపోగానే కన్నపు దొంగ ఒక తాటినిచ్చెన తీసుకుని జేబు దొంగతో రాజభవనం దగ్గిరకు వచ్చాడు.

''ఏమిటిది? రాజభవనంలోనే జొరబడతావా ఏం?'' అన్నాడు జేబుదొంగ ఎంతో భయంతో.

''అవును. మామూలు ఇళ్ళలో జొరబడటంలో నేర్పరితనం ఏముందీ?'' అంటూ కన్నపుదొంగ తాటినిచ్చెనను గోడ మీదికి విసిరివేశాడు.

దానికి పట్టు చిక్కగానే కన్నపుదొంగ పైకి ఎక్కుతూ, జేబు దొంగను తన నిచ్చెన ఎక్కి వెనకే రమ్మన్నాడు.

ఇద్దరూ రాజుగారి ఆవరణలో ప్రవేశించారు. కన్నపుదొంగ రాజుగారి భవనం తలుపు ఒకటి ఊతక ఎత్తి లోపల జొరబడి రాజుగారి శయ్యాగారానికి దారి తీశాడు. కాళ్ళు వణుకుతూ జేబు దొంగ కూడా వాడి వెనకే వెళ్ళాడు.

పడక గదిలో రాజుగారు నిద్రపోతున్నాడు. బానిస ఒకడు రాజుగారికి కాళ్ళు పట్టుతూ కునికిపాట్లు పడుతున్నాడు. జేబుదొంగను అవతల గదిలో ఉండమని సైగ చేసి, కన్నపుదొంగ మునివేళ్ళ మీద నడుస్తూ వెళ్ళి బానిసను వెనకనుంచి పట్టుకుని, ఒక చేత్తో నోరు నొక్కి రెండో చేత్తో వాణ్ణి తాడుతో కట్టేసి, నోట్లో గుడ్డలు కుక్కి, గదిలో ఒక మూల పారేసి, వాడి స్థానంలో తాను కూచుని రాజుగారికి కాళ్ళు పట్టసాగాడు.

వాడు కావాలని రాజుగారి కాళ్ళు గట్టిగా పట్టటంతో రాజుగారికి నిద్రాభంగమయింది. కన్నపుదొంగ చిన్న గొంతుతో, ''ఏలినవారికి మెలుకువ వచ్చినట్టుంది. ఒక చిన్న కథ చెబుతాను, ఆలకించండి:

అనగనగా ఒక నగరం. దాన్ని ఒక రాజుగారు పాలిస్తున్నారు. ఆ నగరంలో ఒక జేబుదొంగా, ఒక కన్నపుదొంగా ఉన్నారు. వారిద్దరిలో ఎవరు ఎక్కువ నేర్పరి అని సమస్య వచ్చింది. ముందుగా జేబుదొంగ తన నేర్పరితనాన్ని ప్రదర్శించటానికి తన స్నేహితుణ్ణి షరాబుబజారుకు తీసుకుపోయాడు," అంటూ జరిగిన కథ యావత్తూ చెప్పాడు.

అఖరుకు తాను రాజుగారి శయ్యా మందిరంలో ప్రవేశించి, జానిసను కట్టి అవతల పెట్టి, వాడి స్థానం ఆక్రమించుకోవటందాకా చెప్పి, "మహారాజా, తమరే చెప్పండి! ఈ యిద్దరిలో ఎవరు ఎక్కువ నేర్పరి? జేబుదొంగా, కన్నపుదొంగా?" అని అడిగాడు.

ఇదంతా కథే కాబోలు ననుకుని రాజుగారు, "నిశ్చయంగా కన్నపు దొంగే నేర్పరి!" అన్నాడు. ఈ మాటలు అవతల ఉండే జేబుదొంగకు కూడా వినిపించాయి. తిరిగి రాజుగారికి నిద్ర పట్టినదాకా కాళ్ళు పిసికి, కన్నపుదొంగ తన స్నేహితుడితో సహా రాజభవనం నుంచి తిరిగి వచ్చేశాడు.

మర్నాడు ఉదయమే రాజుగారు నిద్ర లేచి, తన జానిస కట్టిపడేసి ఉండటం చూసి, తాను రాత్రి విన్నది కథ గాదనీ, తనకు ఆ కథ చెప్పినవాడు కన్నపు దొంగే ననీ గ్రహించి, వాడి తెలివితేటలకు ముచ్చటపడ్డాడు. తరవాత ఆయన ఒక చాటింపు వేయించి, కిందటి రాత్రి తన పడకగదిలో జొరబడిన దొంగ బయట పడినట్టయితే వాడికి కొలువిస్తానన్నాడు.

ఆ చాటింపు విని కన్నపుదొంగ రాజుగారి దర్శనం చేసుకున్నాడు. అన్న ప్రకారం రాజుగారు వాడికి తన కొలువులో మంచి ఉద్యోగం ఇచ్చాడు.

కన్నపుదొంగ నేర్పరితనం గొప్పదని రాజుగారే స్వయంగా తీర్పు చెప్పటం తన చెవులతో విన్నాడు గనక జేబుదొంగ కాదనలేదు. అందుచేత వారు ప్రేమించిన పిల్ల కన్నపుదొంగనే పెళ్ళాడి, గొప్ప ఉద్యోగి భార్య అయింది.



## ఫోటో వ్యాఖ్యల-పోటీ :: బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1982 నవంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



S. B. Takalkar

★



Chandrapal Singh

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్కమాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ సెప్టెంబర్ నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింప బడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## జూలై నెల పోటీ ఫలితాలు

మొదటి ఫొటో : నెమలి కన్ను సొగసు!

రెండవ ఫొటో : నీ కేమి తెలుసు?

పంపినవారు : వై. రామచంద్ర, బ్రాడీపేట, గుంటూరు-2.

బహుమతి మొత్తం రు. 50/- నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

CHANDAMAMA (Telugu) SEPTEMBER 1982 Regd. No. M. 4854




ఆకుపచ్చ
వెండి
నారింజ రంగు
వెండి
ఎరుపు
వెండి
పసుపుపచ్చ

# మోసానికి తావే లేదు!

ఇప్పుడు అసలైన పాపిన్స్‌పై చుట్టబడే కాగితంపై వెండి చారలుంటాయి!

పిల్లలూ, ఏమిటో ఊహించండి మరి! ఇప్పుడు మోసగాళ్ళు మిమ్మల్ని మోసం చేయలేరిక. మీరు చేయవలసిందల్లా ఆకర్షణీయమైన పార్లే పాపిన్స్ ఫోయిల్ ప్యాక్ పైన వెండి చారలున్నాయా అన్నది చూడడమే. ఆతర్వాత పండ్ల రుచుల పాపిన్స్ నోట్లో వేసుకుని మురిసి పోవడమే సరేనా మరి?

పార్లే
పాపిన్స్



నకిలీచేసే వాళ్ళు మిమ్మల్నిక మోసం చేయలేరిప్పుడు.



everest/81/PP/101-tl